Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు    స్థాపితం: 1930    జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 81 • సంచిక: 35 • 27-8-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





● కొత్త పార్టీ ఏర్పాటు తప్ప...

# జగన్ దారులన్నీ మూసుకొన్నాయి!

కాంగ్రెస్ అధిష్టానానికి, వైఎస్ జగన్‌కు మధ్య నడుస్తున్న దాగుడుమూతలాట చివరి అంకానికి చేరుకొన్నది. డిసెంబర్ నెలాఖరులో శ్రీకృష్ణ కమిటీ నివేదిక వచ్చేవరకు కాలం వెళ్లదీయాలని ఇద్దరిలోనూ వున్న అభిలాష నెరవేరేట్లు కన్పించడం లేదు. జగన్ అడుగులు వడివడిగా పడడం, అధిష్టానం మాటలు తూలడం రెండూ ఏకకాలంలో జరిగి పోతుండడం వల్ల ఏదో ఒక ముగింపు పలకక తప్పని పరిస్థితి ఇద్దరికీ ఏర్పడుతున్నది.

జగన్‌ను పార్టీ నుంచి బయటకు పంపించాలన్న కోరిక అధిష్టానానికి ఏ కోశానా లేదు. అయితే, ఆయన తనంత తానుగా వెళ్లి పోవాలన్నది అభిలాష. అట్లనే, జగన్‌కు పార్టీలో కొనసాగాలనే ఉత్సాహం ఎంత మాత్రం లేదు. అయితే పార్టీ తనను వెళ్ల గొట్టిందన్న సానుభూతితో ప్రజల ముందుకు వెళ్లాలన్నది అంతరంగం. మనసులో ఈ కోరికలు వుంచుకొని ఇద్దరూ ఇన్ని రోజులుగా నాటకాలు ఆడుతున్నారు. డిసెంబర్ నెలాఖరువరకు ఇదే ధోరణిలో కొనసాగాలని కోరుకొన్నారు. కానీ పరిస్థితులు చేయి దాటి పోతున్నాయి.

జగన్ చేత ఓదార్పు యాత్ర మాన్పించాలన్నది అధిష్టానం పట్టుదల. మందీ మార్బలం, తప్పెట్లు, ఔట్లు, బాణసంచా పేలుళ్లు, జనసందోహాలు లేకుండా నిశ్శబ్దంగా పది మంది అనుచరులతో బాధితుల ఇళ్లకు వెళ్లి ఓదార్పు వచనాలు పలికి, ఇవ్వదలచిన నాలుగు రూపాయలు

కొరవ 14వ పేజీలో



# మత్తు వదలాలి!

ఈవారం జరిగిన రెండు సంఘటనలు తెలుగు సినిమా పరిశ్రమను కలవరానికి, కల్లోలానికి గురి చేశాయి. మొదటిది – మాదక ద్రవ్యాలు కొనుగోలు చేస్తూ హీరో రవితేజ సోదరులు పోలీసులకు దొరికిపోవడం. రెండవది – వ్యభిచారపు కొంపలో వర్ధమాన నటీమణులు జ్యోతి, సైరాబాను పట్టుబడడం. ఇవి రెండూ ఒక్క సినీ పరిశ్రమ తీరు తెన్నులనే కాక, మొత్తం యువతరం పెడ పోకడలకు అద్దం పడుతున్నాయి.

హైదరాబాద్ నగరం మాదక ద్రవ్యాల వినియోగానికి కేంద్రంగా మారి పోయిందన్న ప్రచారం చాలాకాలం నుంచే వుంది. రాజకీయవాదులు, ఉన్నతాధికారులు, పారిశ్రామిక వేత్తలు, నియో రిచ్ సంపన్న కుటుంబాలకు చెందిన పిల్లలు ఈ భయంకరమైన దుర్వ్యసనానికి బానిసలౌతున్నారని పోలీసులకు బాగా తెలుసు. నగరంలో తామర తంపరగా పుట్టుకొని వస్తున్న ఖరీదైన పబ్బులు ఈ దారుణ వ్యాపారానికి స్థావరాలన్న నిజం కూడా పోలీసులకు తెలుసు. కానీ ఈ నిశాచర విలాస కేంద్రాల యజమానులు, వాటికి నిత్యం వెళ్లి వచ్చేవారు ఖరీదైన మనుషులు కావడంతో వాటి జోలికి వెళ్లడానికి ఇంతకాలం ఏ పోలీసు అధికారి కూడా సాహసం చేయలేదు. వాటి లోపల జరుగుతున్న అసాంఘిక కార్యక్రమాలన్నిటినీ కళ్లు మూసుకొని చూస్తుండిపోయారు. దానితో డ్రగ్స్ వ్యాపారులు హైదరాబాద్ నగరాన్ని తమ సురక్షిత స్థావరంగా మలచుకొన్నారు. ప్రాణాంతకమైన ఈ పదార్థాలను ఇళ్ల వద్దకు సరఫరా చేసే స్థాయిలో ఆ వ్యాపారాన్ని వ్యవస్థీకృతం చేశారు.

నిజానికి డ్రగ్స్ మహమ్మారి ఒక్క హైదరాబాద్ నగరపు సమస్య కాదు. యావత్ ప్రపంచం ఈ సమస్యతో సతమతమౌతున్నది. సౌదీ అరేబియా, థాయిలాండ్, చైనా వంటి దేశాలలో డ్రగ్స్ వాడే వారిని, అమ్మే వారిని ఉరి తీసేంత కఠినమైన శిక్షలు అమలులో వున్నా వాటి వినియోగం మాత్రం మందగించడం లేదు. ఒకసారి ఆ మత్తు రుచి చూసిన వారిని గమ్మత్తుగా చిత్తు చేయడం డ్రగ్స్ లక్షణం. విచ్చలవిడి జీవితానికి అలవాటుపడిన యువతీ యువకులు ఈ ప్రలోభానికి సులువుగా బానిసలైపోతారు. ఒకసారి అలవాటుపడిన తర్వాత వాటి కోసం ఎంతటికైనా తెగిస్తారు. ఎంత సొమ్ము అయినా ఖర్చు చేస్తారు. ఆ బలహీన క్షణంలో వారికి ప్రాణం కంటే, పరువు మర్యాదల కంటే అవి ఇచ్చే మత్తే ఎక్కువగా కనపడుతుంది. దావూద్ ఇబ్రహీం వంటి అంతర్జాతీయ స్మగ్లర్లు, అల్ ఖైదా ఉగ్రవాదులు, ఉత్తర కొరియా పాలకులు, పాకిస్తాన్ సైనికులు ఈ డ్రగ్స్ రవాణా ద్వారానే తమ ఆర్థిక అవసరాలు తీర్చుకోవడం అలవాటై పోయింది. ప్రభుత్వాల స్థాయిలోనే డ్రగ్స్ వ్యాపార వ్యవస్థ నిర్మాణం కావడం వల్ల సాధారణ పోలీసు చర్యలు వాటిని నివారించలేక పోతున్నాయి.

అయితే కుటుంబ సాంప్రదాయాలకు, కట్టుబాట్లకు ఎంతో కొంత విలువ మిగిలి వున్న దక్షిణాది రాష్ట్రాలలో యువతరం డ్రగ్స్‌కు బానిసలుగా మారడానికి తల్లితండ్రుల నిర్లక్ష్యమే కారణమని చెప్పక తప్పదు. కోట్లకు కోట్లు ఎట్లా సంపాదించాలనే యావ తప్ప, తమ పిల్లల బాగోగులను పట్టించుకొనే తీరిక లేని కుటుంబాలలో, అవినీతితో అందలం ఎక్కే ఐఎఎస్, ఐపిఎస్ అధికారుల ఇళ్లలో, సులువుగా ధన సంపాదనకు అలవాటు పడిన రాజకీయవాదుల లోగిళ్లలో డ్రగ్స్ మహమ్మారి సులభంగా తిష్ట వేస్తున్నది. తమ పిల్లలు ఆధునిక జీవనానికి, అది అందించే సౌఖ్యాలకు దగ్గర కావాలని ప్రోత్సహించడం, లెక్కా జమ లేకుండా పసితనంలోనే వారికి కోరినంత డబ్బు చేతికివ్వడం, అర్థరాత్రి అపరాత్రి వినోదాలను అనుమతించడంతో యువతరం ఈ వ్యసనానికి బానిసలుగా మారుతున్నారు. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొన్నట్లు తమ పిల్లలు మత్తు పదార్థాలకు పూర్తిగా బానిసలుగా మారిన తర్వాత కానీ తల్లితండ్రులు ఆ నిజం తెలుసుకోలేక పోతున్నారు. అప్పుడు డీఅడిక్షన్ సెంటర్లకు పరుగులు తోలినా కొందరి విషయంలో ప్రయోజనం వుండడం లేదు. ప్రాణాలు తీసే ఈ డ్రగ్స్ మహమ్మారిని నివారించడానికి ఎంత పెద్ద పోలీసు యంత్రాంగం కూడా చాలదు. అది ఇళ్లలోనే, తల్లితండ్రుల ప్రేమాదరణలోనే మొదలు కావాలి. ఎవరికి వారు తమ పిల్లల జీవనశైలిని నిశితంగా గమనించి ప్రారంభదశలోనే జాగ్రత్తపడితే తప్ప ఈ ప్రమాదం నుంచి సమాజం తప్పించుకోవడం జరగని పని.

జమీన్‌రైతు

## జనవాణి

### మత్తులో రాష్ట్ర రాజధాని!

వాణిజ్య ప్రపంచీకరణ మనదేశ ఆర్థిక వాణిజ్య వ్యవసాయ వ్యవస్థలనే గాదు సమగ్ర సామాజిక వ్యవస్థను తలక్రిందులు చేస్తోంది. బహుళ జాతి వాణిజ్య సంస్థలతోపాటు అన్ని దేశాలకు చెందిన భయంకర నేరస్తులు మన దేశంలో చొరబడి పోయారు. నైజీరియా, ఉగాండా దేశాల నుంచి చదువుకోను వచ్చామంటూ చెబుతూ సినీ నటులకు మాదక ద్రవ్యాలను సరఫరా చేస్తూ పట్టుబడిన వ్యక్తిని కదిపితే ఈ వ్యవహారంలో డొంకంతా కదిలింది. పలువురు ప్రముఖుల పిల్లలు, సినీ నటులు, నటీమణులు ప్రతినిత్యం మత్తులో జోగుతున్నట్లు హైదరాబాద్ సిటీ పోలీస్ కమిషనర్ ఎ.కె.ఖాన్ ప్రకటించారు. పబ్బుల సంస్కృతి యువత భవిష్యత్తును అగమ్య గోచరం చేస్తుంది. ఇప్పటికైనా ప్రభుత్వం మేల్కొని మత్తులో మునిగిన రాష్ట్ర రాజధాని మత్తు వదిలించాల్సి వుంది.

షేక్ షరీఫ్ — నెల్లూరు

### తిరుమలను కాపాడండి!

తిరుమల హిందువుల పవిత్ర పుణ్యక్షేత్రం. ఇక్కడి కార్యకలాపాల నిర్వహణ బాధ్యతలు ఆధ్యాత్మిక జిజ్ఞాసుల చేతిలో కాకుండా రాజకీయ నేతల చేతిలో వున్నాయి. దీనివల్ల తిరుమలలో ఎక్కడ చూసినా దళారుల బెడద పెరిగిపోయింది. విఐపిల ముందు పాలకవర్గం సాగిలపడుతుండడం వల్ల సామాన్య భక్తులు దేవదేవుని కొన్ని సెకన్ల పాటు మాత్రమే చూడగలుగుతున్నారు. వెంకటేశ్వరస్వామికి శ్రీకృష్ణదేవరాయలు సమర్పించిన నగలనే కరిగించిన ఘనులు తిరుమల తిరుపతి దేవస్థానం పాలకవర్గ ప్రభువులు. ముఖ్యమంత్రి రోశయ్య దైవభక్తి పారాయణుడు. తిరుమలలో కొనసాగుతున్న దోపిడీని ఆపను కార్యాచరణను రూపొందించాల్సి వుంది.

పి.అరుణకుమారి — నెల్లూరు

### గ్రామాల్లో పారిశుధ్యం పాతర!

గ్రామాల్లో పారిశుధ్య పరిస్థితులు నానాటికీ క్షీణిస్తున్నాయి. దీనివల్ల గ్రామ ప్రాంతాల్లో పలు రకాల అనారోగ్య సమస్యలు తలెత్తుతున్నాయి. గతంలో గ్రామాల్లో పారిశుధ్య నిర్వహణ కోసం ప్రభుత్వం ఐదు శాతం నిధులు కేటాయించేది. ప్రస్తుతం 15 శాతం నిధులు విడుదల చేస్తున్నా ప్రజారోగ్యానికి చేటు తెచ్చే అపరిశుధ్యాన్ని తొలగించేవారు లేకుండా పోయారు. స్వచ్ఛమైన గాలి, నీరు, పచ్చని పంట పొలాల చుట్టూ నీటి వసతితో ఎంతో ఆహ్లాదకరమైన

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

30-8-1940
పేజీలు : 16 వెల: అణా

### గూడూరులో సంస్కరణ వివాహం

27-8-40ది రాత్రి విజయనగరం నివాసియగు భమిటిపాటి వీరశర్మ గారికిని, తూర్పు గోదావరి జిల్లా పెనుమళ్ల నివాసిని వర్ధనమ్మ గారికిని గూడూరులో హిందీ పండితులు ఎ.ఎల్.సాంబశివరావు గారి ఆధ్వర్యమున వారి స్వగృహములో వివాహం జరిగింది. వరునిది ప్రథమ వివాహం. వధువు బాల్య వితంతువు. ఈడు బాగుంది ఇరువురు వైదీకులే.

ఇది మూడవ సంస్కరణ వివాహం ఈ కుటీరంలో జరిగింది. పంతులు గారు యిలాంటి వివాహాలు పట్టుపట్టి చేయిస్తారు. మాంగల్యధారణ జరుగుతుంటే పంతులు గారి ఆ చూపుల్లో ఆశీర్వాదాలు దొర్లుతుండినవి.

### ముసలి పెండ్లిండ్ల ముచ్చట

### రాపూరు పెండ్లి

ఆది వెలమ కులాంకారుడు 60 సంవత్సరాల శత వృద్ధుడు అయిన ఒక ‘యువకుడు’ 9వ తేది ఒక 16 సంవత్సరాల బాలిక మెడలో బలవంతపు పుస్తె గట్టాడు. ఈయనకు 50 సంవత్సరాల భార్య, 24 సంవత్సరాల కూతురు, షుమారు కొత్త పెండ్లి కూతురు వయసుగల మనమరాలు వున్నారు. ఈ పెండ్లి ప్రథమ భార్యకు, కూతురికి, మనమరాలికి, అల్లుడికి, తల్లికి, చెల్లెలికి, మేనకోడలికి, బంధువులకు, గ్రామస్తులకు, వారింట్లో వుండే కుక్క కోడి, కాకి, గేదె వీటన్నింటికీ కూడా ఇష్టం లేదు. అసలు పెండ్లి కూతురు కన్నీటిధార చేతనే పెండ్లి జరిగిందంటే చాలదా?

ఎందుకయ్యా! ఈ ఘోర కృత్యాలు చూస్తూ మానవ సంఘం బ్రతికి వుండి మాత్రం?

శివ! శివా!!

## 50 ఏళ్ల క్రితం ఈవారం

26-8-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ముగ్గురు మంత్రులు వైదొలగాలి!

ఎన్నిక కమిటీ ఎన్నికలో తనను వ్యతిరేకించినందుకు ముఖ్యమంత్రి సంజీవయ్య, ఏ.సి.సుబ్బారెడ్డి గారిని మంత్రివర్గం నుంచి తొలగించారు. ఇప్పుడు మంత్రివర్గంలోనే వుండి నాయకునికి వ్యతిరేకంగా పని చేస్తున్న కాసు బ్రహ్మానందరెడ్డి, పి.వి.జి.రాజు, కొండా లక్ష్మణ్ గారలు గూడా మంత్రి వర్గం నుండి వైదొలగవలసి వస్తుందా?

దీనికి సమాధానం రేపు ఎన్నికలో తేలే బలాబలాలను బట్టిగాని చెప్పలేము. మంత్రివర్గ వ్యతిరేకులదే మెజారిటీ అయితే, వీరిని రాజీనామా యివ్వమని అడిగే సాహసం సంజీవయ్యకు వుండకుండా పోయినా పోవచ్చు. అయితే దేనికైనా ఈ ముగ్గురు మంత్రులు సిద్ధమట.

### జిల్లాలో భయంకర క్షామం!

నెల్లూరుజిల్లా కోవూరు – నెల్లూరు డెల్టాతో సహా క్షామ ప్రమాదంలో వుంది. డెల్టాలో అధికభాగం నాట్లు జరుగలేదు. వేసినవి ఎండిపోతున్నవి. నారు ముదిరి పోవడమేగాదు, కాపాడుకోవడం సాధ్యపడుతుందా అనే సందేహం కలుగుతున్నది. వెన్ను తీసిన తెల్లకేసరి ఎండిపోతున్నది.

కనిగిరి, సర్వేపల్లి రిజర్వాయర్లలో గానీ, పెన్నలోగాని చుక్క నీరులేదు. వారంలోగా వర్షం లేకున్నా ఏరు రాకున్నా డెల్టా కూడా భయంకర క్షామానికి గురికాక తప్పదు.

మెట్ట తాలుకాలలో పరిస్థితి మరీ దుర్భరంగా వుంది. పైర్లు సరే పూజ్యమైనవి. త్రాగుటకు నీరులేక అల్లాడుతున్నారు. పశువులకు గ్రాసం లేదు. సన్నజనానికి పనులు లేవు. ఉదయగిరి, కనిగిరి వగైరా ప్రాంతాల నుండి ప్రజలు వలస పోతున్నట్లు వార్తలు వస్తున్నవి.

# నెల్లూరు ముచ్చట్లు



**నెల్లూరు రేబాలవారి చిన్నపిల్లల ఆస్పత్రిలో అర్ధరాత్రి తనిఖీ చేసి హాజరు పట్టీని పరిశీలిస్తున్న జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి.**

## రోశయ్య, జగన్ పర్యటనలు రద్దు!

25వ తేది నెల్లూరుకు రావాల్సిన ముఖ్యమంత్రి రోశయ్య, కడప ఎమ్పీ జగన్మోహన్‌రెడ్డిలు తమ పర్యటనలను చివరి నిమిషంలో రద్దు చేసుకొన్నారు. ముఖ్యమంత్రి రోశయ్య నగరంలోని అనిల్ గార్డెన్స్‌లో జరిగిన కందుకూరు ఎమ్మెల్యే మహిధర్‌రెడ్డి కుమార్తె వివాహానికి హాజరు కావాల్సింది. వర్షం కారణంగా ఉదయం 9-45 ప్రాంతంలో ఆయన పర్యటన రద్దయినట్లు వున్నతాధికారులకు సమాచారం అందింది. అంత వరకు ట్రాఫిక్ ఆంక్షల పేరిట నగర ప్రజలను నెల్లూరు పోలీసులు ఓ ఆట ఆడి నానాతిట్లు తిన్నారు.

మహిధర్‌రెడ్డి కుమార్తె పెళ్లి, రాజీవ్‌భవన్ నిర్వాహకుడు అనిల్ కుమార్ యాదవ్ రిసెప్షన్‌కు హాజరు కావాల్సిన కడప ఎమ్పీ వైఎస్ జగన్మోహన్‌రెడ్డి లోక్‌సభలో అణు ఒప్పందంపై చర్చను పురస్కరించుకొని తప్పనిసరిగా ఎమ్పీలు పార్లమెంటులో వుండమని పార్టీ విప్ జారీ చేయడంతో నెల్లూరుకు రాలేకపోయారు.

## జనార్దన్‌రెడ్డి రాక

మాజీ ముఖ్యమంత్రి, రాజ్యసభ సభ్యుడు నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి 27వ తేది నెల్లూరుకు వస్తారు. 2తేది వరకు జిల్లాలోనే వుంటారు. ఆత్మీయులు, బంధువులు, అనుచరుల ఇళ్లలో జరిగే వివాహాలకు హాజరవుతారు.

## రాజీవ్‌భవన్ సమర్ధకులకు తిట్లు!

రాజీవ్‌భవన్ వెంట నడుస్తున్న నలుగురు కార్పొరేటర్లకు కాంగ్రెస్ పార్టీ తరపున మళ్లీ పోటీచేసే అవకాశం ఇవ్వబోమని రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ప్రకటించారు. 24తేది భక్తవత్సలనగర్‌లో జరిగిన పార్టీ కార్యకర్తల సమావేశంలో మాట్లాడుతూ వాళ్లు పార్టీ భిక్షతో ఎదిగి పార్టీకే కంటకంగా మారారు. వచ్చే కార్పొరేషన్ ఎన్నికల్లో పార్టీ ద్రోహులకు, తమపై అర్ధం పర్ధంలేని విమర్శలకు దిగుతున్న వ్యక్తులకు ప్రజలే గుణపాఠం చెబుతారని వివేకానందరెడ్డి చెప్పుకొచ్చారు. కార్పొరేషన్ టిక్కెట్ల పంపిణీ వ్యవహారం తన చేతిలోనే వుంటుందని చెప్పేందుకు వివేకా ఈ వ్యాఖ్యలు చేసినట్లుంది. కాని ఇదంత సులభమా?

## కామాక్షమ్మకు బంగారు మకర తోరణం

జొన్నవాడ కామాక్షమ్మకు చెన్నైకు చెందిన రాజగోపాల్‌రెడ్డి అనే భక్తుడు మూడులక్షలు వెచ్చించి బంగారు మకర తోరణాన్ని చేయించి ఇచ్చారు.

## వికలాంగులకు కృత్రిమ అవయవాలు

వికలాంగులకు కృత్రిమ అవయవాల పంపిణీకి ఈ నెల 30తేది నెల్లూరు ఎసి స్టేడియంలో ప్రత్యేక శిబిరం ఏర్పాటు చేస్తున్నట్లు జడ్పీఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి చెప్పారు. శిబిరానికి వచ్చే వికలాంగులందరికీ ఎంత ఖర్చయినా కృత్రిమ అవయవాలను అమరుస్తామని జడ్పీ ఛైర్మన్ ప్రకటించారు.

## జగన్‌ను టార్గెట్‌చేసి మాట్లాడిన పనబాక!

కేంద్ర జౌళిశాఖ సహాయమంత్రి పనబాక లక్ష్మి 22తేది నెల్లూరుకు వచ్చారు. ఈ సందర్భంగా ఆమె విలేకరులతో మాట్లాడుతూ వైఎస్ జగన్‌పై నర్మగర్భ వ్యాఖ్యలు చేశారు. కాంగ్రెస్ పార్టీకి 125 ఏళ్ల చరిత్ర వుంది. పార్టీలో కుమ్ములాటలు మామూలు. ఇక్కడ వ్యక్తులకు ప్రాధాన్యం లేదు. రాష్ట్రంలో ముఖ్యమంత్రి రోశయ్య నేతృత్వంలో అభివృద్ధి పనులు కొనసాగుతున్నాయి. గతంలో ప్రకటించిన ఏ పథకాలు ఆగవు. దేశంలో అభివృద్ధి జరగాలన్నా, పేద, బడుగు, బలహీన వర్గాల వారు అభివృద్ధి చెందాలన్నా కాంగ్రెస్ పార్టీతోనే సాధ్యమవుతుందన్నారు. చివరలో జగన్ గూర్చి విలేకరులు గుచ్చి గుచ్చి అడుగ్గా ఆయన గూర్చి ఢిల్లీలోనే మాట్లాడానని, ఇక్కడ ప్రత్యేకంగా మాట్లాడవల్సిందేమి లేదని లేచారామె. నెల్లూరు ఎమ్పీగా వున్నప్పటి వ్యవహారశైలికి, ఇప్పటి శైలికి పనబాకలో మార్పు కొట్టొచ్చినట్లు కనబడుతుంది. వెటకారం పాలు ఆమె మాటల్లో ఎక్కువయ్యింది. కాలమహిమ!

## మీ నెత్తిన బూడిదే!

సర్వేపల్లి నియోజకవర్గ పరిధిలో ఇబ్బడిముబ్బడిగా ఏర్పాటుచేస్తున్న థర్మల్ విద్యుత్ కేంద్రాల వల్ల భవిష్యత్తులో ఈ ప్రాంతీయులకు ఇబ్బందులు తప్పవని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి వాపోయారు. 22వతేది నెల్లూరులోని తెలుగుదేశం పార్టీ ఆఫీసులో ఆయన విలేకరులతో మాట్లాడుతూ మంత్రి రామనారాయణరెడ్డి ముత్తుకూరు మండలవాసులతో ఇక మీ నెత్తిన బూడిదేనని ఆంతరంగిక చర్చలలో చెబుతూ ఆమంచర్ల ప్రాంతాల్లో భూములు కొనుక్కొని బాగుపడండని ఉచిత సలహా కూడా ఇచ్చారని చెప్పారు. జిల్లా అధికారులు ఈ ప్రాంతంలో పరిశ్రమల స్థాపనకు ఇస్తున్న అనుమతులు ఇకనైనా మానాలని చంద్రమోహన్‌రెడ్డి కోరారు.

## ఖైదీకి స్వైన్‌ఫ్లూ!

నెల్లూరు సెంట్రల్ జైలులో జీవిత ఖైదుననుభవిస్తున్న ప్రకాశంజిల్లాకు చెందిన ఉదయతుల్లా (40) స్వైన్‌ఫ్లూ వ్యాధి సోకింది. ఇతనిని నెల్లూరు పెద్దాసుపత్రిలో ఏర్పాటుచేసిన ప్రత్యేక స్వైన్‌ఫ్లూ వార్డులో వుంచి చికిత్స చేస్తున్నారు. గతంలో ఊపిరితిత్తుల వ్యాధితో బాధపడుతుండిన ఈ ఖైదీ ఇటీవల హైదరాబాద్‌లోని ఉస్మానియా ఆసుపత్రికి వెళ్లి వైద్య పరీక్షలు చేయించుకొని వచ్చాడు.

ఖైదీకి స్వైన్‌ఫ్లూ రావడంతో సెంట్రల్ జైలులో కలకలం రేగింది. ఈ నేపథ్యంలో జిల్లా కలెక్టర్ రాంగోపాల్ సెంట్రల్ జైలును 23తేది సందర్శించి ఖైదీలకు ధైర్యం చెప్పారు. పెద్దాసుపత్రికి వెళ్లి ఉదయతుల్లాను సైతం పరామర్శించారు. కలెక్టర్ స్వైన్‌ఫ్లూ వ్యవహారంలో చొరవ ప్రదర్శించడంతో ఆయనపై ప్రశంసల జల్లు కురిసింది.

## వర్షం

గతవారం రోజులుగా నెల్లూరు నగరంలో ప్రతినిత్యం ఏదోఒక సమయంలో వర్షం కురుస్తోంది. కొన్నిసార్లు దంచి కొడుతున్న వర్షం మరికొన్ని సార్లు పొడి పొడిగా పడుతోంది. 25తేదీ రోజంతా వర్షం పడింది. వర్షానికి నగరంలో పారిశుధ్య పరిస్థితులు మరీ క్షీణించాయి. దీని వల్ల సీజనల్ వ్యాధులు మరింత విజృంభించే అవకాశముంది.

## కాకాణి అర్ధరాత్రి తనిఖీలు

తన ఆకస్మిక తనిఖీలతో వైద్యులు, ఆరోగ్య సిబ్బందిని హడలెత్తిస్తుండే జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి 22వ తేది అర్ధరాత్రి రేబాల వారి వీధిలోని చిన్న పిల్లల ఆసుపత్రిని తనిఖీ చేశారు. ఈ సమయంలో ఆసుపత్రిలో డాక్టర్ లేరు. పెద్దసంఖ్యలో చిన్న పిల్లలు వివిధ రుగ్మతలతో బాధపడుతూ ఆసుపత్రిలో చికిత్స పొందుతుండగా వీరందరికీ ఒకే నర్సు మాధవి నిద్రమేల్కొని సేవలందిస్తుండింది. డ్యూటీలో వుండాల్సిన మరో నర్సు లేకపోవడం, ఆసుపత్రిలో వాచ్‌మెన్ మంచినిద్రలో ఉండడాన్ని గమనించిన ఛైర్మన్ వారిపై చర్యలకు ఉన్నతాధికారులకు సిఫార్సు చేశారు. ఆసుపత్రిలో రోగులతోపాటు వారి సహాయకులు ఎక్కువ సంఖ్యలో వుండడాన్ని ఛైర్మన్ తప్పు పట్టారు.

పాత రోజులను గుర్తుకు తెస్తూ ఛైర్మన్ జరిపిన అర్ధరాత్రి తనిఖీలతోనైనా ప్రభుత్వాసుపత్రులలో సేవలు మెరుగుపడితే అదే పదివేలు. కాకాణి కూడా ఇదే లక్ష్యంతో అర్ధరాత్రి తనిఖీలు చేపట్టారని చెప్పొచ్చు.

## బోగోలు తహశీల్దార్ ఆఫీసులో చోరీ!

బోగోలు తహశీల్దార్ కార్యాలయంలో 22తేది రాత్రి దొంగలు పడ్డారు. గదుల తలుపులు పగులగొట్టి, బీరువాలను ధ్వంసం చేసిన దొంగలు కార్యాలయంలోని రికార్డులన్నీ కలియబెట్టారు. మండలంలో ఈ మధ్య పలు భూకుంభకోణాలకు పాల్పడిన ల్యాండ్ మాఫియానే తమకు కావాల్సిన ఫైళ్ల కోసం ఈ పని చేసి వుండవచ్చున్న అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. కావలి సిఐ కృష్ణకిషోర్‌రెడ్డి, క్లూస్‌టీం దొంగతనం జరిగిన తీరును పరిశీలించింది.

## దారికి రాని థియేటర్లు

నెల్లూరు నగరంలోని సినిమా థియేటర్లలో పరిస్థితులు మెరుగు పర్చాలని రెండు మాసాల క్రితం అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య యజమానులతో ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేసి కోరినా మెరుగుపడలేదు. ఇదే విషయాన్ని బిజెపి యువమోర్చా నేతలు 23తేది జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్‌ను కలసి విన్నవించారు. నగరంలోని 16 థియేటర్లలలో మరుగుదొడ్లు సరిగ్గా లేవని, ఎసి వేయడం లేదని, వేసినా మధ్యలో ఆపేస్తున్నారని, సీట్లు సరిగా లేవని, నల్లులు, ఎలుకలు, బొద్దింకలు తిరుగుతూ జనాన్ని బెంబేలెత్తిస్తున్నాయని జాయింట్ కలెక్టర్ దృష్టికి తీసుకొచ్చారు. చాలా థియేటర్లలో వాహనాలను పార్కింగ్ చేయడం ఇబ్బందిగా వుందని ఈ వ్యవహారాలను పరిశీలించి తగిన చర్యలు తీసుకోమని జాయింట్ కలెక్టర్‌ను కోరారు. జాయింట్ కలెక్టర్‌ను కలసిన వారిలో యువమోర్చా నాయకులు చిలకపాటి శ్రీనివాసులు, చెవుల యుగంధర్, ముక్కు రాధాకృష్ణ తదితరులున్నారు.

## ఇందిరాభవన్‌లో రాజీవ్ జయంతి

మాజీ ప్రధాని స్వర్గీయ రాజీవ్ గాంధీ 66వ జయంతిని నెల్లూరు ఇందిరాభవన్‌లో నిర్వహించారు. డిసిసి అధ్యక్షుడు ఎల్లసిరి గోపాలరెడ్డి రాజీవ్ గాంధీ చిత్రపటానికి పూలమాల వేశారు. అనంతరం ఆయన మాట్లాడుతూ రాజీవ్ గాంధీ ఆలోచనల నుంచి పుట్టినదే ఇన్ఫర్మేషన్ టెక్నాలజి అన్నారు. దీనివల్లే పలువురు యువకులకు వుద్యోగాలు వచ్చాయన్నారు. పంచాయితీరాజ్ వ్యవస్థను కూడా ప్రక్షాళన చేసిన ఘనత ఆయనదే

కొరవ 14వ పేజీలో



సబ్‌స్టేషన్లలో పేరుకుపోయిన సమస్యల వల్లే కోత. (ఫైల్‌ఫోటో).

# విద్యుత్ కోత లేదంటూనే కోతలు!

రాష్ట్రంలో సమృద్ధిగా జలవిద్యుత్ ఉత్పత్తి అవుతున్నది. వర్షాలు కూడా విస్తారంగా పడుతున్నాయి. జిల్లాలో విద్యుత్ కోతలేదని ట్రాన్స్‌కో ఎస్‌ఇ నందకుమార్ పదే పదే ప్రకటిస్తున్నా నెల్లూరు నగరంలో తరచూ విద్యుత్ సరఫరా ఆగిపోతుంది. గంట, రెండు గంటలకు గానీ తిరిగి రావడం లేదు. నగర నడిబొడ్డు ప్రాంతమైన పొగతోటతోపాటు ఆచారి వీధి, చిన్నబజారు, పెద్దబజారు, బృందావనం, మూలాపేటల్లో ప్రతినిత్యం ఏదో ఒక సమయంలో విద్యుత్ సరఫరా నిలిపేస్తున్నారు. సరఫరా ఆగిన విషయాన్ని వినియోగదారులు ఫిర్యాదు కేంద్రానికి తెలియజేసినా గతంలో మాదిరి వెనువెంటనే స్పందించడం లేదు. ప్రస్తుతం కొనసాగుతున్న సీజన్‌లో కురిస్తే వర్షం లేదంటే అదిరిపోయే ఎండల మధ్య విద్యుత్ సరఫరా ఆగి జనం ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు. పొదలకూరురోడ్డు ప్రాంతంలో విద్యుత్‌కోతకు తోడు వారంలో ఒకటి రెండు రోజులు హైఓల్టేజి సమస్య జనాన్ని అల్లాడిస్తుంది. ఈ నెలలో 13, 20, 21 తేదీల్లో ఈ ప్రాంతంలో హైఓల్టేజి సమస్యతో ఈ ప్రాంతీయుల విద్యుత్ ఉపకరణాలు కాలిపోయాయి. నగరంలో ఎఇలు, ఎడిఇలుగా యువకులే పనిచేస్తున్నారు. సమన్వయ లోపం వల్ల చిన్న సమస్య వచ్చినా దాన్ని పరిష్కరించను రోజులు తీసుకొంటున్నారు. పలు సబ్‌స్టేషన్లలో చిన్న చిన్న విద్యుత్ ఉపకరణాల కొరత వల్ల సమస్యలు ఉత్పన్నమవుతున్నట్లు తెలిసింది. కోట్లాది రూపాయల ఆదాయంతో నడుస్తున్న సంస్థలో చిన్న వస్తువుల కొనుగోలులో సైతం తాత్సారం చేసి ప్రజలను ఇబ్బందిపెడితే ఎలా?



నేర సమీక్షా సమావేశంలో మాట్లాడుతున్న ఎస్పీ దామోదర్.

# చోరీలు జరగకుండా చూడండి!

నెల్లూరుతోపాటు జిల్లాలోని ఇతర ప్రాంతాల్లో చోరీలు ఎక్కువయ్యాయని వాటి నియంత్రణకు అవసరమైన చర్యలు తీసుకోవాలని పోలీసు అధికారులను ఎస్పీ దామోదర్ ఆదేశించారు. 21వ తేది పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లోని ఉమేష్‌చంద్ర కాన్ఫరెన్స్ హాలులో జరిగిన నెలవారీ నేర సమీక్ష సమావేశంలో ఎస్పీ మాట్లాడుతూ చోరీల నియంత్రణకు గస్తీలు పెంచాలన్నారు. నేరాలు తగ్గుముఖం పట్టాలంటే క్రైం పోలీసులు, లా అండ్ ఆర్డర్ పోలీసులు కలసి టీమ్ వర్క్ చేయాలన్నారు. పోలీసు గస్తీలను ఎస్‌ఐలు రాత్రిపూట పరిశీలిస్తే బాగుంటుంది. జిల్లాకు వచ్చే ప్రముఖులతోపాటు ప్రజాప్రతినిధుల భద్రతకు పోలీసు ముందస్తు తనిఖీ చేయక తప్పదన్నారు. అప్పుడప్పుడు రైల్వేస్టేషన్, ఆర్టీసి బస్టాండ్, లాడ్జీల దగ్గర తనిఖీలు చేస్తే మంచి ఫలితాలు వుంటాయన్నారు. పెండింగ్‌లో వున్న కేసులను త్వరితగతిన పరిష్కరించాలని వారంట్లు పెండింగ్‌లో లేకుండా చూడాలని ఎస్పీ డిఎస్పీ, సిఐ, ఎస్‌ఐలకు సూచించారు.

# ఆరునూరైనా ఓదార్పుకు వెళ్తా!

## మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి ప్రకటన



విలేకరులతో మాట్లాడుతున్న ఉదయగిరి ఎమ్మెల్యే చంద్రశేఖర్‌రెడ్డి.

నెల్లూరు జిల్లాలో కడప ఎమ్పీ వైఎస్ జగన్మోహన్‌రెడ్డి చేపట్టే ఓదార్పు యాత్రలో ఆరునూరైనా పాల్గొంటానని ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి స్పష్టం చేశారు. 21వ తేది నెల్లూరు దర్గామిట్టలోని తమ గెస్ట్‌హౌస్‌లో విలేకరులతో మాట్లాడారు. ఈ సమావేశంలో ఎమ్పీ రాజమోహన్‌రెడ్డి కూడా పాల్గొంటారని ముందుగా సమాచారం ఇచ్చినా చంద్రశేఖర్‌రెడ్డి ఒక్కరే పాల్గొన్నారు. తాను చెప్పదలచుకొన్న విషయాన్ని సూటిగా, విలేకరులు అడిగిన ప్రశ్నలకు కాస్త నాటకీయంగా సమాధానాలిచ్చారాయన. ఓదార్పు యాత్ర సెప్టెంబర్ నెల మూడవ వారంలో జిల్లాలో జరుగుతుంది. ఉదయగిరి నియోజకవర్గానికి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చేసిన సహాయాన్ని తనతోపాటు నియోజకవర్గ ప్రజలు కూడా మరువలేరన్నారు. ఓదార్పు యాత్రలో పాల్గొనవద్దని అధిష్టానం నుంచి ఒత్తిళ్లు వచ్చినా మేకపాటి సోదరులు రాజీపడరు. అయినా ప్రజల ఉద్దేశ్యాన్ని తెలుసుకోను 22వ తేది నుంచి నియోజకవర్గ పరిధిలోని మండలాల్లో కార్యకర్తల సమావేశాలు నిర్వహించి జగన్ ఓదార్పు యాత్రకు సంబంధించిన కార్యాచరణ ప్రణాళిక రూపొందిస్తామన్నారు. జగన్ యాత్రలో పాల్గొనాలని ప్రజల నుంచి ఎమ్మెల్యేలపై తీవ్ర ఒత్తిడి వస్తుందని దీనికి కనిగిరి ఎమ్మెల్యేనే సాక్షి అన్నారు. జిల్లా ఎమ్మెల్యేలకు కూడా ఇది తప్పదన్నారు. రాష్ట్రంలో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి లేని కొరత తీవ్రంగా కనిపిస్తుందని, జగన్‌కు పార్టీలో, ప్రభుత్వంలో సముచిత స్థానం కల్పించి ఆ లోటు తీర్చాలని చెప్పారు. ఇప్పటి వరకు సోనియాగాంధీ ఓదార్పు యాత్రపై ఒక్క మాట మాట్లాడలేదని చంద్రశేఖర్‌రెడ్డి చెప్పుకొచ్చారు.

# భూకేటాయింపుల వెనుక భారీ కుంభకోణం!

రాష్ట్రంలో సంచలనం కల్గిస్తున్న ఎమ్మార్ ప్రాపర్టీస్ కంటే భారీ అవినీతి జిల్లాలో ఎస్‌ఇజడ్‌లు, ధర్మల్ విద్యుత్ ప్రాజెక్టులకు భూముల కేటాయింపులో జరిగిందని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఆరోపించారు. రెవిన్యూ మైనింగ్ అధికారులకు ఈ అవినీతిలో భాగముందన్నారు. కెవిపి రామచంద్రరావు చెప్పినట్లుగా అధికారులు వ్యవసాయ భూములను పారిశ్రామికవేత్తలకు కట్టబెట్టి కోట్ల రూపాయల అవినీతికి పాల్పడ్డారన్నారు. జిల్లావ్యాప్తంగా వేలాది ఎకరాలను ఈవిధంగా కొల్లగొట్టారని ఆరోపించారు. సాధారణంగా వ్యవసాయానికి పనికిరాని భూములను, ఎస్‌ఇజడ్‌లను ప్రాజెక్టులకు కేటాయించాలని జిల్లాలో దీనికి విరుద్ధంగా జరిగిందన్నారు. ధర్మల్ ప్రాజెక్టుల నిర్వహణలోనూ నిబంధనలు పాటించడం లేదన్నారు. విలువైన సిలికా భూములు పారిశ్రామికవేత్తల పరం అవుతున్నాయి. ల్యాంకోకు గూడూరు డివిజన్‌లో 1100 ఎకరాలు కేటాయిస్తున్నారని తెలిపారు. అధికారులు, నేతల అవినీతి కారణంగా తీరప్రాంత భూములన్నీ బూడిద భూములుగా మారబోతున్నాయని, వీటన్నింటిపై విచారణ జరిపించాలని డిమాండ్ చేశారు.



విలేకరుల సమావేశంలో మాట్లాడుతున్న తెలుగు నేత చంద్రమోహన్‌రెడ్డి.

# శ్రావణ మాసం వచ్చింది - ధరలు పెంచింది!



పూల ధరలు బాగా పెరిగాయి.

శ్రావణ మాసం వచ్చిందంటే వ్రతాలు, నోములు, పూజలతో గృహాలు, దేవాలయాలు కళకళలాడుతుంటాయి. ఎక్కడ చూసినా ఆధ్యాత్మికత వెల్లివిరుస్తుంటుంది. ముఖ్యంగా మహిళలు ఈ మాసంలో నోచే నోములు, చేసే పూజలకు ఎంతో ప్రాధాన్యత వుంది. మంగళ గౌరీ వ్రతం, వరలక్ష్మీ వ్రతాన్ని పలువురు ఆచరిస్తుంటారు. దీనికి పూలు, పండ్లు, ఆకులు అవసరం ఎంతో వుంది. దీనిని దృష్టిలో వుంచుకొని వ్యాపారులు ఒక్కసారిగా ధరలు పెంచేశారు. మామూలుగా మూర ఐదు రూపాయలకు దొరికే మల్లెపూలు, సన్నజాజి 20వ తేది 15 రూపాయలయ్యాయి. కదంబం మూర 25 రూపాయలుగా అమ్మారు. అలంకరణకు వినియోగించే పత్రి, కలువపూలు, తమలపాకులు, టెంకాయలు విపరీతంగా ధర పలికాయి. అరటిపండ్లు, బత్తాయి, ఆపిల్ పండ్ల సంగతి సరేసరి. వ్యాపారులు చెప్పే ధరలు ఎక్కువైనా వ్రతాలకు, పూజలకు అవసరం కావడంతో అధిక ధరలకే కొనుగోలు చేయాల్సి వచ్చింది.

## మూరపూలు రూ. 15పైనే!

# ఫిష్షింగ్ హార్బర్ ఏర్పాటు జరిగేనా?

**జిల్లాలోని తీరప్రాంతంలో ఫిష్షింగ్ హార్బర్ ఏర్పాటు చేయాలన్న డిమాండ్ చాలా రోజులుగా వుంది. తాజాగా కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు దీన్ని బోగోలు మండలం జువ్వలదిన్నె సమీపంలోని చిప్పలేరు వద్ద నిర్మించమని ముఖ్యమంత్రి రోశయ్యను కలిసి అభ్యర్థించారు.**



ఫిష్షింగ్ హార్బర్‌తో తీర ప్రాంతంలో అభివృద్ధి.

**జిల్లాలోని తీరప్రాంత పట్టపు పాళాలలో సముద్రంపై ఆధారపడి జీవిస్తున్న మత్స్యకారుల చిరకాల కోరిక ఫిష్షింగ్ హార్బర్. ఫిష్షింగ్ హార్బర్ ఏర్పాటుకు గత కొన్నేళ్లుగా ప్రజాప్రతినిధులు, మత్స్యకార సంఘాల నాయకులు ప్రయత్నాలు చేస్తూనే వున్నారు. ఫిష్షింగ్ హార్బర్ ఏర్పాటుకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సానుకూలంగానే స్పందిస్తున్నాయి.**

అయితే ఆచరణలోకి తీసుక వచ్చేందుకు మాత్రం తగిన కృషి జరగడం లేదు. కృష్ణపట్నం పోర్టు ఏర్పాటుకారణంగా పలు మత్స్యకార గ్రామాలు ఖాళీ చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఖాళీ చేసిన గ్రామాలకు చెందిన మత్స్యకారులు సముద్రంలో వేట సాగించలేక కూలి పనులకు వెళ్తున్నారు. ముత్తుకూరు మండలంలో కృష్ణపట్నం పోర్టుతోపాటు వివిధ థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులు ఏర్పాటుకానున్నాయి.

బొగ్గు ఆధారిత పరిశ్రమలు ఏర్పాటైతే వాతావరణ కాలుష్యం ఏర్పడే ప్రమాదం వుందని పర్యావరణ విశ్లేషకులు హెచ్చరిస్తున్నారు. ఈ క్రమంలో ముత్తుకూరు మండలంలో ఫిష్షింగ్ హార్బర్ ఏర్పాటు జరగడం కష్టమని చెప్పవచ్చు. కృష్ణపట్నం పోర్టు ఏర్పాటు జరగక ముందు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు చెందిన అధికారులు ఈ ప్రాంతంలో ఫిష్షింగ్ హార్బర్ ఏర్పాటుకోసం పలు దఫాలు పర్యటించి పరిశీలన జరిపి వెళ్లడం జరిగింది. గత తెలుగుదేశం ప్రభుత్వ హయాంలోనే ఇది నిర్మాణం జరుగుతుందని అందరూ భావించారు.

## పట్టించుకొన్న వారు లేరు!

అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు సైతం కృష్ణపట్నంను సందర్శించి ఫిష్షింగ్ హార్బర్ ఏర్పాటుకు అంగీకారం తెలిపారు. ఆతర్వాత దీని గురించి పట్టించుకునే దిక్కు లేకుండా పోయింది. కావలి ఎమ్మెల్యేగా బీద మస్తాన్‌రావు ఎన్నికైన తర్వాత జిల్లాలో ఫిష్షింగ్ హార్బర్ ఏర్పాటుపై ముఖ్యమంత్రిని కలిసి విన్నవించారు. అయితే దీనికి గతంలో భావించినట్లు ముత్తుకూరు మండలంలో కాకుండా బోగోలు మండలం జువ్వలదిన్నె సమీపంలోని చిప్పలేరు వద్ద నిర్మించాలన్నది ఎమ్మెల్యే అభిప్రాయం.

జిల్లాలో విడవలూరు మండలంలోని ఊటుకూరు, పల్లెపాళెం, బోగోలు మండలంలోని జువ్వలదిన్నె ప్రాంతాల్లో ఫిష్షింగ్ హార్బర్ ఏర్పాటు చేయాలన్న ప్రతిపాదన వుంది. అయితే జువ్వలదిన్నె సమీపంలోని చిప్పలేరు అన్నివిధాలుగా అనుకూలంగా వుండడంతో ఇక్కడే ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. ఇందుకు కనీసం ఐదెకరాల స్థలం అవసరం కానుంది. కేంద్ర ప్రభుత్వం నుంచి కోటిన్నరకు పైగా నిధులు కూడా కేటాయించబడ్డాయి. స్థలం కేటాయింపు విషయంలో రెవిన్యూ మంత్రి స్పందించడం లేదు.

మన రాష్ట్రంలో 930 కిలోమీటర్ల పొడవునా తీరప్రాంతం వుంది. నెల్లూరు జిల్లా నుంచి శ్రీకాకుళం వరకు ఇది విస్తరించి వుంది. మూడు సంవత్సరాల క్రితం నవయుగ కన్‌స్ట్రక్షన్స్ కంపెనీ ఆసియా ఖండంలోనే అతిపెద్ద ఓడరేవును కృష్ణపట్నం సమీపంలో నిర్మించేందుకు శ్రీకారం చుట్టింది. ఓడరేవు ఏర్పాటు జరిగితే ఉపాధి అవకాశాలు లభిస్తాయని ఎంతో ఆశతో వున్న మత్స్యకారులకు చివరకు నిరాశే మిగిలింది. ఈ ప్రాంత మత్స్యకారులు జీవనం సాగించేందుకు బోగోలు, మైపాడు, చిల్లకూరు మండలాలకు వలసలు వెళ్లారు.

## ఫిష్‌ల్యాండ్ పెడతారట!

మత్స్యకారులు సముద్రంలో పట్టిన చేపల్ని ఎండ బెట్టుకొనేందుకు ఫిష్‌ల్యాండ్‌ను ఏర్పాటు చేస్తామని జిల్లా మత్స్యశాఖ అధికారులు చెబుతున్నారు. ఇటీవల ఈ శాఖ అధికారులు ముత్తుకూరు మండలంలోని తీరప్రాంతంలో పర్యటించి ఈ ప్రకటన చేయడం జరిగింది. ఈ మండలంలో అసలు చేపలు వేటకు వెళ్లే అవకాశం లేకపోవడంతో ఫిష్‌లాండ్ ఏర్పాటు చేస్తామని అధికారులు ప్రకటించడం ఆశ్చర్యం కలిగిస్తుంది. కృష్ణపట్నం పోర్టు, వివిధ విద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణాలు జరుగుతున్న కారణంగా గ్రామాలను ఖాళీ చేయాలని భావిస్తున్న తరుణంలో అధికారులు పర్యటించడం విశేషం.

జీవనోపాధి కల్పించమని అధికారులు, ప్రజాప్రతినిధుల చుట్టూ తిరుగుతున్నా ఒక్కరు కూడా మత్స్యకారుల గురించి పట్టించుకోలేదు. వున్నపళంగా మత్స్యశాఖ అధికారులు తీరప్రాంతంలో ఆకస్మిక పర్యటనలు చేసి ఫిష్‌ల్యాండ్ ఏర్పాటు చేస్తామని చెప్పడంపై మత్స్యకార సంఘాల నాయకులు అభ్యంతరం వ్యక్తం చేస్తున్నారు. తీరప్రాంతంలో లభించే మత్స్య సంపదను ఆధారంగా చేసుకుని ఫిష్షింగ్ హార్బర్‌ను ఏదో ఒక ప్రాంతంలో ఏర్పాటు చేయాలన్న ప్రయత్నాలు చురుగ్గా జరగడం లేదు.

డైరక్టర్ ఆఫ్ పోర్టు ప్రాజెక్టు రిపోర్టు కోసం బెంగుళూరుకు చెందిన సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కోస్టల్ ఇంజనీరింగ్ అండ్ ఫిషరీస్‌ను సంప్రదించి వుంది. ఈ సంస్థకు చెందిన ఇంజనీర్లు జిల్లాలోని తీరప్రాంత మండలాల్లో అనేకసార్లు పర్యటించి ఫిష్షింగ్ హార్బర్‌పై సర్వే నిర్వహించి వెళ్లారు. ఈ బృందం నిర్వహించిన సర్వేలో ఫిష్షింగ్ హార్బర్‌ను బోగోలు మండలంలోని చిప్పలేరు వద్ద నిర్మించాలని సూచించారు. ఇందుకు రాష్ట్ర మత్స్యశాఖ కమిషనర్ కృష్ణయ్య అనుమతి కూడా ఇచ్చారు.

కమిషనర్ కూడా త్వరలో ఈ ప్రాంతంలో పర్యటించే అవకాశం వుంది. కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు తన నియోజకవర్గంలో ఫిష్షింగ్ హార్బర్ ఏర్పాటుకు అనుమతి తెచ్చుకోవడంలో సఫలీకృతులయ్యారు.

ఇదిలా వుండగా కావలి, బోగోలు మండలాల సరిహద్దులో వున్న జువ్వలదిన్నె, అన్నగారిపాళెంలో పర్యాటక కేంద్రాన్ని ఏర్పాటు చేయడానికి కూడా స్థానిక ఎమ్మెల్యే ప్రయత్నాలు సాగిస్తున్నారు. ఈ ప్రాంతాల్లో ఫిష్షింగ్ హార్బర్, పర్యాటక కేంద్రం ఏర్పాటు జరిగితే కావలి, బోగోలు, అల్లూరు మండలాలకు చెందిన ప్రజలకు ఉపాధి కూడా దొరుకుతుంది.

మొత్తం మీద జిల్లా మత్స్యకారుల చిరకాల కోరికగా వున్న ఫిష్షింగ్ హార్బర్ ఏర్పాటు ఎప్పుడు చేపడతారన్నది అధికారులే తేల్చి చెప్పాలి.





నెల్లూరు ఇందిరాభవన్‌లో జరిగిన రాజీవ్ వర్ధంతి సభలో ఆయన చిత్రపటానికి నివాళులర్పిస్తున్న ఎల్లసిరి గోపాల్‌రెడ్డి, పందిళ్లపల్లి అరుణమ్మ, ఉడతా వెంకట్రావ్, రఘురామ్, చెంచలబాబు.



వృద్ధ కళాకారులకు పెన్షన్‌ను పెంచాలని కోరుతూ జిల్లా కలెక్టర్ రాంగోపాల్‌కు వినతిపత్రం ఇస్తున్న తెలుగుదేశం పార్టీ సాంస్కృతిక విభాగం అధ్యక్షుడు దోర్నాల హరిబాబు.




పెన్నా రచయితల సంఘం నేతృత్వంలో జరిగిన 'బాల్యం ఒక మధుర జ్ఞాపకం' కవి సమ్మేళనంలో పాల్గొన్న పల్లెపాడు డైట్ విశ్రాంత ఉపన్యాసకుడు శ్రీనివాసరావును సన్మానిస్తున్న గుండాల నరేంద్రబాబు. ప్రక్కన మోపూరు పెంచల నరసింహం.




ప్రజారాజ్యం పార్టీ అధ్యక్షుడు చిరంజీవి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని నర్తకీ సెంటర్‌లో జరిగిన కేక్ కటింగ్ కార్యక్రమంలో పాల్గొన్న నగర ఎమ్మెల్యే శ్రీధరకృష్ణారెడ్డి, ఖాజావలి, ద్వారక్‌నాథ్ తదితరులు.

# శనగ రైతులకు కష్టాలు!

సముద్ర తీర ప్రాంత మెట్టభూముల్లో వేరుశనగ పంటను సాగుచేస్తున్న రైతుల పరిస్థితి దయనీయంగా వుంది. ఒక వైపు పెరిగిన పెట్టుబడులు, మరోవైపు కూలీలు దొరకని స్థితిలో పండించిన పంటకు గిట్టుబాటు ధర లేక అల్లాడిపోతున్నారు. విపరీతంగా పెరిగిన పెట్టుబడులు రైతులకు ఆర్థిక భారం అయ్యాయి. దీనికితోడు రసాయనిక ఎరువులు, పురుగు మందుల ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. ఈ పరిస్థితిలో పంట సాగు చేస్తున్న

## గిట్టుబాటు ధర కూడా లేదు

శనగ రైతులకు కూలీల సమస్య మరింత ఇబ్బంది పెడుతున్నది. పంట చేతికొచ్చేదాకా భయం భయంగా వుంటున్నారు వేరుశనగ రైతులు. విడవలూరు మండలంలోని రామతీర్థం, పొన్నపూడి, గౌరీపురం, కంచరపాళెం, ఊటుకూరు, వీరారెడ్డిపాళెం తదితర గ్రామాల్లో వేలాది ఎకరాల్లో వేరుశనగ సాగుచేస్తున్నారు. వాణిజ్య పంట అయినప్పటికీ రైతులకు కష్టాలు అధికంగా వుండడంతో తెగుళ్లు వ్యాపించి, వాతావరణ మార్పులు కారణంగా ఊహించని విధంగా శనగ రైతులు నష్టపోతున్నారు.

# ఆర్‌అండ్‌బి రోడ్లు ఘోరం!

## ఎస్‌ఇకి విన్నవించిన వెంకటగిరి ఎమ్మెల్యే



ఆర్‌అండ్‌బి రోడ్లు దారుణంగా దెబ్బతిని వున్నాయని, వాటి మరమ్మత్తులను వెంటనే చేపట్టాలని వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ, ఆశాఖ ఎస్‌ఇ విజయ్‌కుమార్‌ని కోరారు. వెంకటగిరికి వచ్చిన ఎస్‌ఇని కలసిన రామకృష్ణ నియోజకవర్గంలో వివిధ ప్రాంతాల్లో దెబ్బతిన్న రోడ్ల గురించి ప్రస్తావించారు. వెంకటగిరి, డక్కిలి, బాలాయపల్లి, రాపూరు, సైదాపురం, కలువాయి మండలాల్లోని రోడ్లు మరీ అధ్వాన్నంగా వున్నాయన్నారు. ప్రభుత్వానికి అంచనాలతో కూడిన ప్రతిపాదనలు పంపితే ఎమ్మెల్యేగా తన వంతు కృషి చేస్తామన్నారు. అనంతరం ఆయన విలేకర్లతో మాట్లాడుతూ రైతులకు సాగునీటిని పుష్కలంగా అందించేందుకు పెద్ద చెరువుల్లో ఒకటైన బాలాయపల్లి మండలంలోని కయ్యూరు చెరువును రిజర్వాయర్‌గా అభివృద్ధి చేస్తామన్నారు. ఏడు గ్రామాల్లో రెండు వేల ఎకరాలకు సాగునీరు అందించే ఈ చెరువును అభివృద్ధి చేసేందుకు 17కోట్లతో అంచనాలను ప్రభుత్వానికి పంపామన్నారు. శిథిలమైన బాలాయపల్లి పోలీస్ స్టేషన్‌కు నూతన భవన నిర్మాణానికి కృషి చేస్తున్నామన్నారు.

# ఎన్‌బికెఆర్‌కు జాతీయ పురస్కారం!

● ప్రతిష్ట పెరిగింది

విద్యానగర్‌లోని ఎన్‌బికెఆర్ ఇంజనీరింగ్ కళాశాలకు జాతీయ పురస్కారం లభించింది. కళాశాల కరస్పాండెంట్ రాంకుమార్‌రెడ్డి, ప్రిన్సిపాల్ కిరణ్‌శ్రీలను న్యూఢిల్లీకి చెందిన ఆలిండియా ఆచీవర్స్ ఫౌండేషన్ సంస్థ 2010–11 సంవత్సరానికి శిక్షాభారత్ పురస్కారాలకు ఎంపిక చేసింది. రాష్ట్రంలోని ఆరు ఇంజనీరింగ్ కళాశాలకు ఈ అరుదైన గౌరవం దక్కగా అందులో ఎన్‌బికెఆర్ వుండడం విశేషం.

గ్రామీణ ప్రాంతాల్లో పేద విద్యార్థుల ఉన్నత విద్యకు చొరవ చూపినందుకు కరస్పాండెంట్ రాంకుమార్‌రెడ్డి, అను





వంశీకథపై వ్యాసాన్ని సమర్పించినందుకు ప్రిన్సిపల్ కిరణ్‌శ్రీలు ఈ పురస్కారాలకు ఎంపికయ్యారు. ఉద్యోగులు, విద్యార్థుల సమిష్టి కృషి ఫలితంగా జాతీయ పురస్కారం లభించిందన్నారు రాంకుమార్‌రెడ్డి.

# బిందుసేద్యానికి సబ్సిడీ!

● రైతుల్లో ఆసక్తి

ముత్తుకూరు మండలంలోని రైతాంగం ఆధునిక పద్ధతులలో సాగు చేసేందుకు సమాయత్తం అవుతున్నది. ప్రభుత్వం బిందు సేద్యానికి 90 శాతం సబ్సిడి ఇస్తుండడంతో ఆ దిశగా రైతులు అడుగులు వేస్తున్నారు. వరకవిపూడి ప్రాంతంలో రైతులు అధికంగా ఈ పద్ధతికి శ్రీకారం చుట్టారు. కాకర, వంకాయలను బిందు పద్ధతిలో పండించేందుకు రైతులు అన్ని ఏర్పాట్లు చేసుకొంటున్నారు. ఉమ్మారెడ్డి శేఖర్‌రెడ్డి అనే ఔత్సాహిక రైతు డ్రిప్ ఇరిగేషన్‌లో మెళకువలు తెలుసుకొని పంటల సాగుకు సమాయత్తం అయ్యాడు. నీటి సౌకర్యం తక్కువగా వున్న పరిస్థితులలో ఈ విధానం ఎంతో ఉపయుక్తంగా వుంటుందని చెప్పారు. నీరు పొదుపుగా వాడడంతోపాటు మొక్కల వద్ద కలుపు పెరిగే ప్రమాదం వుండదన్నారు. దీని వల్ల ఇతరత్రా ఖర్చులు తగ్గడంతోపాటు అనుకొన్నరీతిలో తగిన విధంగా పంటల సాగు చేపట్టి దిగుబడి సాధించవచ్చునన్న అభిప్రాయం రైతుల్లో వ్యక్తమవుతుంది.

# పొదుపు గ్రూపులకు 233కోట్ల రుణాలు!

● డిఆర్‌డిఏ పిడి వెల్లడి



జిల్లాలోని పొదుపు గ్రూపులకు ఈ ఏడాది బ్యాంకు నుంచి 233కోట్ల రూపాయలు రుణాలు ఇవ్వాలన్న లక్ష్యాన్ని నిర్దేశించామని డిఆర్‌డిఏ పిడి విజయచందర్ తెలిపారు. సంగం మండలంలో సంఘమిత్ర కార్యాలయాన్ని తనిఖీ చేసిన ఆయన మాట్లాడుతూ 2010–11 సంవత్సరానికి ఈ మొత్తాన్ని రుణాలుగా అందజేయాలన్న ఉద్దేశ్యంతో పని చేస్తున్నామన్నారు. ఇప్పటికి 100 కోట్లకు అనుమతి పొంది 45కోట్ల రుణాలను పంపిణీ చేశామన్నారు. జిల్లాలో 3కోట్ల సిఐఎఫ్, మరో కోటి ఆసరా బకాయిలు వున్నాయన్నారు. రుణాలు తిరిగి చెల్లించని సంఘాలపై ఆర్‌ఆర్ యాక్టు ద్వారా బకాయిల వసూళ్లకు చర్యలు చేపడుతామన్నారు. అర్హత కలిగిన సంఘాలకు 1.30కోట్ల రివాల్వింగ్ ఫండ్ అందజేశామన్నారు. భూ అభివృద్ధి పథకం ద్వారా ఎస్సీ, ఎస్టీ భూములను సాగులోనికి తీసుకరానున్నట్లు తెలిపారు. దీనికిగాను ఆయా భూముల సర్వే చేస్తున్నట్లు చెప్పారు.

# వైఎస్‌తోపాటు యానాదిరెడ్డి విగ్రహావిష్కరణ!

● కావలి ఓదార్పు ప్రత్యేకం

నెల్లూరు జిల్లాలో వైఎస్ జగన్ చేపట్టబోయే ఓదార్పు యాత్ర సందర్భంగా కావలిలో వైఎస్ రాజశేఖర్ రెడ్డి విగ్రహాన్ని ఆవిష్కరించనున్నట్లు మాజీ శాసనసభ్యుడు కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి చెప్పారు. కావలి మండలంలోని ముసునూరు, గౌరవరం, బోగోలు మండలంలోని ముంగమూరు, దగదర్తి, అల్లూరు మండలాల్లో పలు ప్రాంతాలలో ఆయన పర్యటించి కార్యకర్తలతో సమావేశమయ్యారు. ఓదార్పు యాత్ర నెల్లూరుజిల్లాకు చేరుకున్నప్పుడు జగన్ చేతుల మీదుగా వైఎస్ విగ్రహంతోపాటు, మాజీ మంత్రి కలికి యానాదిరెడ్డి విగ్రహాన్ని ఆవిష్కరిస్తారని తెలిపారు. తుమ్మలపెంట పల్లెపాళెంలో వైఎస్ఆర్ నగర్‌ను ప్రారంభిస్తారన్నారు. చిన్నరాముడిపాళెం పూలదొరువులో జగన్ పర్యటన వుంటుందన్నారు.

ఒక వైపు విష్ణు జగన్ పర్యటనకు ఏర్పాట్లు చేసుకొంటుంటే ఆయన్ను నియోజక వర్గంలో వ్యతిరేకించే సోమశిల కమిటి ఛైర్మన్ కండ్లగుంట మధుబాబునాయుడు తనదైన శైలిలో పోటీ కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. జిల్లాపరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డిని తీసుకొని వచ్చి బోగోలు మండలంలో కార్యక్రమాలు జరపడం, ఆదాల ట్రస్టు తరపున వివిధ సంక్షేమ కార్యక్రమాలు చేపట్టడం నియోజకవర్గంలో చర్చనీయాంశమయ్యింది.



**నెల్లూరు కలెక్టరేట్ వద్ద ఫీజుల రీయింబర్స్‌మెంట్ కోసం ధర్నా చేస్తున్న ఎస్ఎఫ్ఐ విద్యార్థి సంఘం, పోలీసుల మధ్య జరిగిన తోపులాట లాఠీ చార్జీకి దారి తీసింది.**

● పేదూరు పంచాయితీ

## కార్యాలయ ప్రారంభం!

**ఆదాల చేతులమీదుగా ఈ కార్యక్రమం**

ఏకగ్రీవంగా ఎన్నికైన పేదూరు గ్రామ పంచాయితీకి నూతన కార్యాలయం ఏర్పాటైంది. ఆగష్టు 15తేది స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా ఈ నూతన కార్యాలయాన్ని సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి ప్రారంభించారు. పనిలో పనిగా రాష్ట్రంలో జరుగుతున్న అభివృద్ధిని గురించి, పేదరిక నిర్మూలన, నిరక్షరాస్యత నిర్మూలనకు జరుగుతున్న కృషిని వివరించారు. అమెరికాలో స్థిరపడిన సుబ్బారెడ్డి తండ్రి అందజేసిన స్థలంలో ఈ కార్యాలయం ఏర్పడడం సంతోషకరం అన్నారు. కృష్ణారెడ్డిపాళెంలో కాంగ్రెస్‌నేత రాజయ్య పిల్లలకు యూనిఫామ్, పుస్తకాలను అందివ్వడాన్ని ఆదాల అభినందించారు. ఈ కార్యక్రమంలో విజయడైరీ ఛైర్మన్ సుధీర్‌రెడ్డి, రంగారెడ్డి, శ్రీనివాసులరెడ్డి, కోటారెడ్డి, విజయసేనారెడ్డి, తహశీల్దార్ లక్ష్మీనారాయణ, ఎంపిడిఓ సుజాత తదితరులు పాల్గొన్నారు.

● రోడ్ల నిర్మాణాల్లో

## నాణ్యతకు తిలోదకాలు!

వెంకటగిరి నియోజకవర్గంలో జరుగుతున్న రోడ్ల మరమ్మత్తు పనుల్లో నాణ్యత లోపిస్తున్నది. వెంకటగిరి మండలం బంగారుపేట నుంచి పిగిలాం గ్రామాల మీదుగా హస్తకావేరి మధ్య రహదారిని బాగు చేసే పనులు 1.8కోట్ల రూపాయలతో జరుగుతున్నాయి. రోడ్లపై నున్న తారును తొలగించి క్రింద వున్న కంకరను అలాగే వుంచి రోలింగ్ చేస్తుండడంతో ఈ నిర్మాణాల్లో పటిష్టత వుండదని పలువురు వ్యాఖ్యానిస్తున్నారు. ఈ పనులకు వినియోగించే రాతిపొడి మిశ్రమాలు పరమ నాసిరకంగా వుంటున్నాయని పలువురు రుజువులతో సహా చూపిస్తున్నారు. జయంపు నుంచి కోటంబేడు మీదుగా మేల్చూరుకు 80 లక్షలతో రోడ్డు నిర్మాణ పనులు వేగిరపరచారు. ఎంతోకాలానికి గ్రామీణ రోడ్లకు మహర్దశ పట్టిందని ప్రజలు ఆనందిస్తున్న తరుణంలో పనుల్లో నాణ్యత లోపించడం చూస్తే ఎక్కువ కాలం నిలచేలా కన్పించడం లేదు. ఇప్పటికైనా అధికారులు రోడ్డు పనులను నాణ్యతతో జరిపించాలని ఆయా గ్రామాల ప్రజలు కోరుకొంటున్నారు.

**వెంకటగిరిలో పరిస్థితిది!**

## మా మధ్య విభేదాలు లేవు

● మస్తాన్‌రావు విషయంలో వంటేరు స్పష్టీకరణ





కావలి నియోజకవర్గం తెలుగుదేశం పార్టీలో తనకు ఇతరులతో ఎలాంటి విభేదాలు లేవని మాజీ శాసన సభ్యుడు వంటేరు వేణుగోపాలరెడ్డి స్పష్టం చేశారు. బోగోలు మండలం అన్నెమడుగులో శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావుకు జరిగిన అభినందన సభలో ఆయన పాల్గొని ప్రసంగించారు. స్వార్థపూరిత రాజకీయాలతో ముందుకు పోయే కొందరు పనిగట్టుకొని తమ మధ్య విభేదాలు సృష్టించేందుకు, రచ్చకీడ్చేందుకు ప్రయత్నిస్తున్నారని ఆవేదన చెందారు. పార్టీని బలోపేతం చేసేందుకు, పూర్వవైభవం తీసుకొని వచ్చేందుకు కలసికట్టుగా పని చేస్తామన్నారు.

బీద మస్తాన్‌రావును పలువురు ఘనంగా సన్మానించారు. దీనికి కృతజ్ఞతలు తెలిపిన మస్తాన్‌రావు పార్టీకి నష్టం కల్గించే వారిని, విభేదాలు సృష్టించేవారిని దూరంగా పెడతామన్నారు. తెలుగుయువత రాష్ట్ర అధ్యక్షుడు బీద రవిచంద్ర మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వం అవినీతిలో కూరుకపోయిందని విమర్శించారు. ప్రజల బాగోగులు పట్టించుకోకుండా ఖజానా నింపుకొనేందుకు మద్యాన్ని ఏరులై పారిస్తూ పేదల బ్రతుకులు ఛిద్రం చేస్తున్నారని ఆరోపించారు. ఒక వైపు ఓదార్పు యాత్ర, మరోవైపు నిట్టూర్పు యాత్రలతో ప్రభుత్వం వైఫల్యం చెందిందన్నారు. అభినందన సభను విజయవంతం చేసిన ప్రతి ఒక్కరికి బీద సోదరులు కృతజ్ఞతలు తెలిపారు.

## ఆత్మకూరు ఆర్టీఓ ఆఫీసులో ఏజంట్ల హవా!

**ఏ పని జరగాలన్నా వారిని కలవాల్సిందే!**

ఆత్మకూరు రవాణాశాఖ కార్యాలయంలో ఏజెంట్ల హవా కొనసాగుతోంది. అన్ని చోట్లా ఏజెంట్ల వ్యవస్థను రద్దు చేసినప్పటికి ఇక్కడ మాత్రం వారు లేకుండా ఏ పని కావడం లేదు. ఏజెంటు ద్వారా రాని దరఖాస్తును కుంటిసాకులతో త్రిప్పి పంపుతున్నారని కార్యాలయానికి వచ్చే వారు వాపోతున్నారు. చేసేదిలేక ఏజెంట్లు అడిగినంత ముట్టజెప్పి పనులు చేసుకోవాల్సి వస్తోందని పలువురు వ్యాఖ్యానిస్తున్నారు. ఒక డ్రైవింగ్ లైసెన్సును కూడా ఏజెంటు లేకుండా నేరుగా వచ్చే వారికి ఇవ్వకూడదని మోటర్ వెహికల్ ఇన్‌స్పెక్టర్ హుకుం జారీ చేశాడట. దీంతో ఏ చిన్న పని జరగాలన్న ఏజెంటు ద్వారానే వెళ్లాల్సివస్తోంది ఆత్మకూరు కార్యాలయంలో. రవాణాశాఖ ఉన్నతాధికారులు ఈ వ్యవహారంపై దర్యాప్తు చేయాల్సిన అవసరం లేదంటారా?

## ఇంటి స్థలం ఎప్పుడిస్తారు?

**బ్రహ్మదేవి ప్రజల ఎదురుచూపు**

ముత్తుకూరు మండలం బ్రహ్మదేవి పంచాయితీపరిధిలో పేదలు ఇళ్లస్థలాల కోసం ఎదురుచూపులు చూడాల్సి వస్తోంది. అధికారులు ఇందుకోసం 4 ఎకరాల 60సెంట్ల ప్రభుత్వ భూమిని సేకరించి, సంబంధిత రైతులకు నష్టపరిహారం చెల్లించినప్పటికీ అర్హులకు మాత్రం ఇంతవరకు స్థలాల కేటాయింపు జరగలేదు. 2008వ సంవత్సరంలో ఈ తతంగం పూర్తయినా పేదలకు స్థలాలు అందకపోవడంతో పేదలు అధికారుల చుట్టూ తిరగాల్సి వస్తోంది. మండల పరిషత్ అధికారులు తాము లబ్దిదారుల జాబితా తయారు చేసి రెవెన్యూ అధికారులకు పంపామని వారు ఆలస్యం చేస్తుండడంతో స్థలాల కేటాయింపు జరగడంలేదని చెప్తుండగా, రెవెన్యూ అధికారులు దీనికి విరుద్ధంగా సమాధానమిస్తున్నారు. తమ సమక్షంలో జాబితా పరిశీలన జరగాల్సి వుండగా అలా జరగలేదన్నది వారి వాదన. మొత్తం మీద అధికారుల నిర్లక్ష్యం పేదలకు శాపంగా పరిణమించింది.

## విద్యార్థులకు బహుమతి ప్రదానం

దగదర్తి జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలో ఉత్తమ మార్కులు సాధించిన విద్యార్థులకు బహుమతి ప్రదానోత్సవం వేడుకగా జరిగింది. ముఖ్యఅతిధిగా విచ్చేసిన జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి మాట్లాడుతూ జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల్లో ఫలితాలు మెరుగు పడ్డాయన్నారు. విద్యార్థులు చదువుతోపాటు క్రీడల్లోనూ రాణించాలని, సంస్కారం, నడవడికలను నేర్చుకోవాలన్నారు. రాష్ట్రీయ మాధ్యమిక మిషన్ క్రింద ప్రతి పాఠశాలకు 31.31 లక్షలు నిధులు ఇస్తున్నామన్నారు. గ్రిగ్స్ పోటీలకు 16లక్షల రూపాయలు వెచ్చిస్తున్నట్లు చెప్పారు. అనంతరం ప్రథమస్థానం సాధించిన పి.శృతి, పిహెచ్. గీత, మౌనికలకు ఒక్కొక్కరికి 10వేల రూపాయలు, ద్వితీయ స్థానంలో నిలచిన హమీద్‌కు 7500 రూపాయలు, తృతీయ స్థానం సాధించిన పుష్పకు 5వేల రూపాయలు అందజేశారు. ఈ కార్యక్రమంలో మాజీ ఎమ్మెల్యే విష్ణువర్ధన్‌రెడ్డి, ఉపాధ్యాయ సిబ్బంది పాల్గొన్నారు.

## పాపం రమణాచారి!



తిరుమల తిరుపతి దేవస్థానం అథారిటీకి ఛైర్మన్ కావా లనుకున్న సీనియర్ ఐఎఎస్ రమణాచారికి ఎదురు దెబ్బ తగిలింది. చాలాకాలం టిటిడి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా రమణాచారి పని చేసి వున్నారు. ఇప్పుడు అథారిటీ ఛైర్మన్ అయి పదవీ విరమణ చేయాలన్నది ఆయన కోరిక. అయితే ప్రస్తుతం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వున్న కృష్ణారావు యిందుకు వ్యతిరేకించడంతో రమణాచారికి నిరాశ ఎదురైంది. రమణాచారి తనకంటే జూనియర్ కాబట్టి ఆ పదవిలో సీనియర్‌ను నియమించాలన్న కృష్ణారావు అభ్యర్థనను ప్రభుత్వం మన్నించి సత్యనారాయణను ఛైర్మన్‌గా నియమించింది. రమణాచారికి యిలా ఎదురుదెబ్బలు తగలడం ఇది కొత్తగాదు. సిఎం పేషీలో చేరాలని ఆ మధ్య శతవిధాలా ప్రయత్నించి భంగపడ్డాడు. పాపం రమణాచారి... సర్వీసులో యివన్నీ మామూలే అన్న సంగతి తెలీదా!

## ఏకె.ఖాన్‌పై సినీవర్గాల రుసరుస



హైదరాబాదు పోలీసు కమిషనరు ఏకె.ఖాన్‌పై తెలుగు సినీ వర్గాలు గుర్రుగా వున్నాయి. సినీ పరిశ్రమలో డ్రగ్స్, వ్యభిచారం వంటి నేరాల్లో పరిశ్రమకు చెందిన వారిని నిర్దాక్షిణ్యంగా బుక్ చేయడం సినీపెద్దలకు రుచించడం లేదు. ఇటువంటి నేరాలు కేవలం సినీ పరిశ్రమలోనే కాదని ఇతరత్రా కూడా జరుగుతున్నా పోలీసుల దృష్టి మాత్రం తమ ఇండస్ట్రీ మీదనే ప్రధానంగా వుండటం పట్ల పెద్దలు కన్నెర్ర చేస్తున్నారు. మాదక ద్రవ్యాల స్మగ్లింగ్, వాడకంకు సంబంధించి ఇటీవల సినీహీరో రవితేజ సోదరుల్ని రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకొని జైలుకు పంపారు. అలాగే వ్యభిచార నేరం కింద సినీతార జ్యోతి, మరో వర్ధమాన హీరోయిన్ సైరాబానును పట్టుకున్నారు. దీంతో ఆగకుండా ఇవే కోణాలతో పోలీసులు ఇండస్ట్రీలోని ఇతరులపై కూడా నిఘా వుంచడం సినీ పెద్దలు జీర్ణించుకోలేకపోతున్నారు. దీన్ని ఆదిలోనే నివారించడానికి యిప్పటికే సిఎం వద్దకు రాయబారాలు కూడా పంపారు. తమ దాకా వస్తేనే కానీ ఈ పెద్దలకు తెలిసి రాదా!

## సురేష్‌రెడ్డిపై నంది ఎల్లయ్య షికాయత్



శాసనసభ మాజీ స్పీకర్ సురేష్‌రెడ్డిపై ఎమ్పీ నంది ఎల్లయ్య తీవ్ర అసంతృప్తిని వ్యక్తం చేస్తున్నాడు. వచ్చే నెల రాష్ట్ర పిసిసి అధ్యక్షుడిగా సురేష్‌రెడ్డిని నియమించే అవకాశం వుందని పత్రికల్లో వార్తలు రావడంతో ఎల్లయ్య పెదవి విరుస్తున్నాడు. ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర నేపథ్యంలో పిసిసి అధ్యక్షుడైతే భవిష్యత్తులో సిఎం అవకాశం వచ్చే వీలుంది. దీన్ని దృష్టిలో పెట్టుకొని ఎల్లయ్య పిసిసి పీఠంపై ఆశలు పెంచుకున్నాడు. ఎస్‌సి వర్గాలకు అవకాశం ఇవ్వాలని డిమాండ్ చేస్తున్నాడు. పిసిసి అధ్యక్షుడిగా ఎలాగూ తెలంగాణ వారిని నియమిస్తారు కాబట్టి ఎస్‌సి వర్గాలకు ప్రాధాన్యం యిస్తే సీనియర్ అయిన తనకు ఛాన్స్ వస్తుందన్నది ఎల్లయ్య ఆశ.

## సెప్టెంబర్ మూడున ముహూర్తం



వచ్చేనెల 3వ తేదీన వైఎస్.రాజశేఖర్‌రెడ్డి తొలి వర్థంతి సందర్భంగా జగన్ తిరుగుబాటుకు రంగం సిద్ధమవుతోంది. ఓదార్పుకు హాజరు కాకుండా ఎమ్మెల్యేల్ని కట్టడి చేస్తున్న నేపథ్యంలో అధిష్టానంపై తిరుగుబాటు తప్పదని జగన్ యిప్పటికే సంకేతాలు పంపాడు. ఈలోగా కడప, ప్రకాశం జిల్లాల్లో ఓదార్పు యాత్రను పూర్తి చేసి వచ్చే నెల మూడన వైఎస్ కాంగ్రెస్ పేరుతో కొత్త పార్టీని ప్రకటించడానికి చకచకా ఏర్పాట్లు జరుగుతున్నాయి. అయితే ఈలోగానే అధిష్టానానికి వ్యతిరేకంగా స్వరం పెంచి పార్టీ నుంచి సస్పెండ్ కావాలన్నది జగన్ వ్యూహం. ఇలా జరిగితే తమ కుటుంబాన్ని కాంగ్రెస్ నుంచి గెంటి వేస్తున్నారని జనం ముందు చెప్పుకోడానికి ఓ బలమైన కారణం దొరుకుతుందన్నది జగన్ అభిప్రాయం. ఈలోగా తన తల్లి చేత రాజీనామా చేయించే యోచన కూడా వుందంటున్నారు. చూద్దాం!

## శ్రీకృష్ణుని జన్మదినోత్సవమే

# జన్మాష్టమి!



శ్రీమహావిష్ణువు అవతారాల్లో శ్రీకృష్ణావతారం ఒకటి. లోకంలో జీవులకు బాధలు హెచ్చినపుడు, పాపం పెరిగినపుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయడానికి జీవులలో అవతరించేదాన్ని లీలావతారం అంటారు. ఇలాంటి అవతారాల్లో భాగవతం ప్రకారం 22వ అవతారం, దశావతారాల్లో ముఖ్యమైనది శ్రీకృష్ణావతారం.

యుగాలలో రెండవదయిన త్రేతా యుగంలో రామునిగా లోకకళ్యాణం చేసిన నారాయణుడు ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడిగా అవతరించి గీతోపదేశం చేసి అర్జునుడికి సత్యదర్శనం చేసి భగవద్గీతను లోకానికి ఉపదేశించాడు. అందుకే కృష్ణుడు జగద్గురువు అయ్యాడు. అలాంటి శ్రీకృష్ణుడు శ్రావణ బహుళ అష్టమినాడు రోహిణి నక్షత్రంలో జన్మించాడు. దేవకీదేవి వసుదేవుల అష్టమ సంతానంగా కంసుని చెరసాలలో జన్మించాడు. ఆ పవిత్రదినాన్ని కృష్ణాష్టమిగా భావించి పండుగ జరుపుకొంటారు. దీనినే గోకులాష్టమి అని, జన్మాష్టమి అని పిలుస్తారు.

చిలిపి బాలునిగా, పశువుల కాపరిగా, రాధాగోపికా మనోహరునిగా, రుక్మిణి సత్యభామాది అష్టమహిళల ప్రభువుగా, యాదవ రాజుగా, పాండవ పక్షపాతిగా, గీతాప్రబోధకునిగా, దేవదేవునిగా, చారిత్రక రాజనీతిజ్ఞునిగా బహువిధాలుగా కృష్ణుని రూపం, వ్యక్తిత్వం, దైవత్వం చిత్రీకరించబడ్డాయి.

శ్రీకృష్ణుని ఒక్కో ప్రాంతంలో ఒక్కో పేరుతో పిలుస్తూ పూజిస్తారు. మధురలో బాలకృష్ణునిగా, పూరీలో జగన్నాధునిగా, మహారాష్ట్రలో విఠోబాగా, రాజస్థాన్‌లో శ్రీనాధ్‌జీగా, ఉడిపిలో శ్రీకృష్ణునిగా, గురువాయూరులో గురువాయూరప్పగా పిలుస్తారు. అలాంటి లీలావతారియైన కృష్ణుని జన్మాష్టమిని దేశవ్యాప్తంగా ఆనందోత్సవాలతో జరుపుకొంటారు. పగలంతా ఉపవాసం వుండి కృష్ణుని పూజిస్తారు. పండ్లు, మీగడ, పెరుగు నైవేద్యంగా సమర్పిస్తారు. ఇంటి ముందు చిన్ని కృష్ణయ్య అడుగులు వేసి, ముగ్గులు పెడతారు. ఊయాల కట్టి శ్రీకృష్ణుని విగ్రహాన్ని అందులో పడుకోబెట్టి పాటలు, కీర్తనలు ఆలపిస్తారు. వాడవాడలా ఉట్టి ఉత్సవాలు నిర్వహించడం పరిపాటి. సెప్టెంబర్ 1వ తేదీన ఈ పండుగను జరుపుకొంటారు.

## మంగన్నా... దారుణమన్నా!



ఫీజుల రీఎంబర్స్‌మెంట్, ఉపకార వేతనాలు మంజూరు చేయాలని కోరుతూ కలెక్టరేట్ ఎదుట ధర్నా చేయను వెళ్లిన విద్యార్థులను నెల్లూరు వన్‌టౌన్ ఎస్ఐ మంగారావు చావచితక కొట్టడం చర్చనీయాంశమయ్యింది. మంగారావు కూడా స్కాలర్ షిప్పులతో చదువుకొని పైకొచ్చిన కుటుంబీకుడు. అటువంటి వ్యక్తి విద్యార్థులు కలెక్టరేట్ గేట్ నెట్టారన్న కుంటిసాకుతో ఫైబర్ లాఠీ చేతబట్టి జలియన్‌వాలాబాగ్‌లో బ్రిటీష పోలీసులు రెచ్చిపోయినట్లు ఆచారివీధి మొత్తం విద్యార్థులను తిప్పి తిప్పి కొట్టి ఈ ప్రాంతీయులను భయ కంపితులను చేశారు. వన్‌టౌన్‌లో రౌడీషీటర్లు ఎక్కువ. వాళ్లను భయపెట్టను ఎస్ఐ విద్యార్థులను టార్గెట్‌గా చేసుకొన్నాడనే వాదన వినిపిస్తుంది. కలెక్టర్ గతంలో ధర్నాలు చేసిన విద్యార్థి సంఘ నేతలను ఈ సారి కలెక్టరేట్ వద్దకు వస్తే బొక్కలో తోయిస్తానని హెచ్చరించిన నేపథ్యంలో మంగన్న రెచ్చిపోయాడన్నది మరో వాదన. అల్లూరులో మంగన్న ఎస్ఐగా పనిచేసే సమయంలో బస్టాండ్ వద్ద ఓ సామాన్యునిపై అకారణంగా ఇదే స్టైల్‌లో లాఠీ ఎత్తాడు. దెబ్బలు తిన్న సామాన్యునికి సహనం నశించి మంగన్నపై తిరగబడ్డాడు. ఆ దెబ్బలు మంగన్న వంటిపై ఇంకావున్నాయి. వాటిని ఎప్పుడైనా చూసుకొంటే మంగన్న ఇటువంటి దుర్మార్గ చర్యలకు సాహసం చేయడు.

## శ్రీకృష్ణ కమిషన్ మౌనం



రాష్ట్ర విభజనపై ప్రజల అభిప్రాయాలు స్వీకరిస్తూ అన్ని ప్రాంతాల్లో పర్యటిస్తున్న శ్రీకృష్ణ కమిషన్ సభ్యులు ప్రారంభంలో పాత్రికేయులు, ఎలాక్ట్రానిక్ మీడియాతో తెగమాట్లాడేవారు. ఈ ధోరణి వల్ల ఇబ్బందులు ఎక్కువయినట్లుంది. ఈ వారంలో రెండురోజులపాటు జిల్లాలో పర్యటించిన కమిటీసభ్యులు అబూసలే షరీఫ్, కన్సల్టెంట్ బిఎల్ జోషిలు ఎక్కడా మీడియాతో మాట్లాడలేదు. అధికారులతో కలసి తాము ఎంచుకొన్న గ్రామాలకు వెళ్లి ప్రజలతో ప్రత్యక్షంగా మాట్లాడి ఆ వివరాలు వ్రాసుకొని వెళ్లారు. వివిధ వర్గాల వినతి పత్రాల స్వీకరణకు పెద్దగా ప్రోత్సహించని తీరు అందరినీ ఆశ్చర్యపర్చింది.

## అన్నింటికీ అట్రాసిటీ కేసు!




ఎమ్మెల్సీ అయినా, మండల మేజిస్ట్రేట్ అయినా వాళ్లపై ఎఫ్ఐఆర్ పెట్టించాలంటే వారంటే పొడగిట్టని వాళ్ల చేతుల్లో వుండే ఆయుధం కులదూషణ మంత్రం. జిల్లాలో ఓ వర్గానికి పని చేయనందుకు దగదర్తి ఎమ్మార్వోపై అట్రాసిటీ తోపాటు అత్యాచారం కేసు నమోదయ్యింది. ఆయన లాక్కోలేక పీక్కోలేక చస్తుంటే, ఆ సంఘటన జరిగి వారం గడవక ముందే ఐఎన్‌టియూసి జాతీయ నాయకుడు, శాసనమండలి సభ్యుడు రాధయ్యపై ఇటువంటి కేసు నమోదయ్యింది. తన స్థలంలో షెడ్ నిర్వహించుకొంటున్న వ్యక్తిని బాడుగ పెంచమన్నందుకు ఎమ్మెల్సీకి ఈ కేసులో ఇరుక్కోక తప్ప లేదు. ఈ చట్టంపై పునర్విమర్శ లేకపోవడం వల్ల తప్పుడు ఫిర్యాదులు ఎక్కువవుతున్నాయని పోలీసు అధికారులే చెప్పడం కొసమెరుపు.

## వీళ్లేం డాక్టర్లు...?



చీము, నెత్తురు ప్రతినిత్యం చూసే నెల్లూరు పెద్దాసుపత్రి డాక్టర్లు, సిబ్బందికి అసలు రోషమే వచ్చేటట్లు లేదు. పెద్దాసుపత్రిలో సరైన వైద్యం అందడం లేదని, ప్రభుత్వం మంజూరు చేసే నిధులు వాడుకోవడం లేదని, విధులకు సిబ్బంది సరిగ్గా హాజరు కావడం లేదని ఇటీవల రూరల్ శాసనసభ్యుడు వివేకానందరెడ్డి తన హాస్పిటల్ తనిఖీలో డాక్టర్లు, సిబ్బందిని నోటికొచ్చినట్లు తిట్టాడు. అది చాలదన్నట్లు జడ్పీఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఈ వారంలో తనిఖీకి వెళ్లి వివేకా స్టైల్‌లోనే ధుమధుమలాడారు. మందలింపులు, పరుషవాక్య ప్రయోగాలు వీళ్లలో కించిత్ మార్పు తీసుకరావడం లేదు. వీరి తోలు మరీ మందంలా వుందని ట్రంకురోడ్డులో జనం వ్యాఖ్యానిస్తున్నారు.



నెల్లూరులో ప్రముఖ రైస్ మిల్లర్ పి.వీరారెడ్డి కుమారుడు ప్రవీణ్‌కుమార్‌రెడ్డి, శ్వేతల వివాహం ఆగష్టు 15తేది రామ్మూర్తి నగర్‌లోని బాలపీరయ్య కళ్యాణ మండపంలో జరిగింది.



నెల్లూరుజిల్లా గ్రంథాలయ సంస్థ వుద్యోగి నాయుడు శ్రీనాధ్‌రెడ్డి కుమార్తె సునేత్రి, హరికృష్ణారెడ్డిల వివాహం ఆగష్టు 15తేది ప్రకాశం జిల్లా నేలటూరు గ్రామంలో జరిగింది.

# వారఫలాలు

*తేది 28-08-2010 నుండి 03-09-2010 వరకు సింహంలో రవి, బుధులు; మీనంలో గురువు; కన్యలో శని, తులలో శుక్రుడు; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; మీన, మేష, వృషభ, మిథునాల్లో చంద్రుడు సంచరిస్తారు.*




కుటుంబసభ్యుల పరస్పర తోడ్పాటు చక్కగా లభిస్తుంది. మిత్రుల మూలంగా మేలు. ధనవిషయాలలో లోటు లేదు. నూతన మార్గాలలో ధనప్రాప్తి అవకాశాలు. ఆగిన పనులు చురుకుగా సాగుతాయి. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. కోర్కెల విషయాలలో నిరాశ ఎదురవుతుంది. మాట నిలబెట్టుకోవడానికి శ్రమపడతారు. పాదాలకు గాయాలు తగిలే అవకాశం.




అధిక ఖర్చులు మనసును కుంగతీస్తాయి. బంధువుల రాక మానసిక ఒత్తిడినిస్తుంది. ఆచితూచి అడుగేయాలి. కుటుంబసభ్యుల ఆరోగ్య లోపం చికాకు నిస్తుంది. వ్యాపారులకు లాభాలలో కొంత కోత ఏర్పడవచ్చు. భాగస్వాములతో గొడవలు రాకుండా చూసుకోవాలి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. ఉద్యోగులకు కొంత మేలు. విద్యార్థులు కాలం వృథా గానిస్తారు.




శరీరంలో జీవశక్తి తగ్గుతుంది. జీర్ణకోశసంబంధిత బాధలుండవచ్చు. ధన విషయంలో కటకట ఉండవచ్చు. సోదరులు, ఇష్టులైన వారివల్ల మనశ్శాంతి వుండదు. పనులు నిదానంగా సాగవచ్చు. ఒకటికి రెండుసార్లు ఆలోచించి చేయడం మంచిది. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా నడచుకోవాలి. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. రాజకీయులకు పైవారితో ఇబ్బంది.




తీవ్ర ప్రయత్నాలతో పనులు సాధించుకోవాలి. సమస్యలను తెలివిగా ఎదుర్కోవాలి. వ్యాపారులకు లాభాలతో మనశ్శాంతి ఏర్పడవచ్చు. నిదానంగా ఖాతాదారుల మనసెరిగి నడచుకోవడం మంచిది. భాగస్వాములతో గొడవలు రాకుండా చూసుకోవాలి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. ఉద్యోగులకు కొంత మేలు. విద్యార్థులకు వృథా కాలక్షేపం. గృహిణులకు పరవాలేదు.




నూతనోద్యోగ ప్రాప్తి అవకాశాలు. ధనవిషయాలలో లోటు లేదు. ధనప్రాప్తి బాగుంటుంది. వ్యాపారులు భాగస్వాముల విషయంలో జాగ్రత్తగా ఉండాలి. వాహనాలు నడిపేసమయంలో జాగ్రత్త. రాజకీయులకు ఉత్తమకాలం. వృత్తిపరులు రియల్ ఎస్టేట్ వ్యాపారులు లాభపడతారు. విద్యార్థులకు కొంత మేలు. కళాకారులకు సన్మాన ప్రాప్తి. స్త్రీలకు వివిధరకాల అనారోగ్య బాధలుండవచ్చు.




చికాకుకు గురౌతారు. అనవసరపు విషయాలలో జోక్యం చేసుకోవద్దు. ఖర్చులధికం. దైవకార్యాలలో పాలు పంచుకొంటారు. వ్యాపారులు భాగస్వాములతో జాగ్రత్తగా మెలగాలి. పైవారి ఆదరణ ఉద్యోగులకు లభిస్తుంది. రియల్ ఎస్టేట్, భూభవనాలు, వస్తు వాహనాల ద్వారా ఆదాయమార్గాలు సులభతరమవుతాయి. ఆస్తి తగాదాలు లాభకరంగా ముగుస్తాయి.

## పంచాంగం

1తేదీ శ్రీకృష్ణాష్టమి.
2తేది శ్రీకృష్ణ జయంతి.

### శుభ ముహూర్తాలు

28, 29తేదిల్లో మకరలగ్నాన సా.4.00 నుంచి 5.30 గంటల వరకు సాధారణ కార్యాలకు.
28, 29, 1, 2తేదిల్లో వృషభ లగ్నాన రా.11.00 నుంచి 12.00 గంటల వరకు వివాహాదులకు.

28, 29, 1, 2తేదీల్లో కర్కాటక లగ్నాన తె.2.30 నుంచి 4.00 గంటల వరకు వివాహాదులకు సుముహూర్తాలున్నాయి.

### ఆగష్టు తిథులు

శ్రావణ శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 29 | శని | చవితి | పూర్తిగా | |
| 30 | ఆది | చవితి | ఉ.07.24 | గం.ల.వ |
| 31 | సోమ | పంచమి | ఉ.09.00 | గం.ల.వ |
| 1 | మంగళ | షష్ఠి | ఉ.10.07 | గం.ల.వ |
| 2 | బుధ | సప్తమి | ఉ.10.40 | గం.ల.వ |
| 3 | గురు | అష్టమి | ఉ.10.32 | గం.ల.వ |
| 4 | శుక్ర | నవమి | ఉ.09.10 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




ప్రయాణాలలో ఇబ్బందులు ఎదురవవచ్చు. ఆరోగ్యవిషయంలో పాదాలకు సంబంధించిన బాధలు, కీళ్లబాధలు ఉంటాయి. ఉద్యోగ ప్రయత్నాలు సఫలమవుతాయి. నూతనమిత్రులు ఏర్పడతారు. దూరదేశ అవకాశాలు కానవస్తున్నాయి. వ్యాపారవృద్ధి చక్కగా సాగుతుంది. కొత్త భాగస్వామి లేదా మంచి అనుచరులు లభిస్తారు. ఉద్యోగినులకు చాలా ప్రయోజవంతమైన కాలం.




ఉద్యోగంలో నూతన బాధ్యతలు అధికం. మానసిక ఒత్తిడికి గురౌతారు. ప్రతి పని ఆలోచించి చేయాలి. తొందరపాటు వద్దు. చిరకాలంగా ఎదురుచూస్తూ వచ్చిన శుభఫలితాలు అనుభూతిలోకి వస్తాయి. అగ్ని, విద్యుత్తు సంబంధిత బాధలుండవచ్చు. వ్యాపారులు కొత్తసంబంధాలు ఏర్పరచుకొంటారు. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం. వృత్తిపరులకు కళాకారులకు మంచి ఆదరణ.




ఆలోచనల్లో అవకతవకలుంటాయి. సోదరుల మూలంగా సమస్యలు ఎదురవుతాయి. ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకోవలసి వస్తుంది. పరిసరాలను గమనించుకొని ప్రవర్తించాలి. ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. వ్యాపారులకు కొంతవరకు మేలు. భాగస్వాములతో జాగ్రత్త. పై అధికారులతో తగాదాలుండవచ్చు.




ఇరుగు పొరుగువారితో జాగ్రత్త. కించపడే అవకాశాలున్నాయి. ఆర్థికవిషయాలలో లోటుండదు. కుటుంబ సభ్యుల వద్ద మీ మాట చెల్లుబాటు అవుతుంది. నూతన వస్త్రాభరణాలకు ఖర్చు చేస్తారు. ఖర్చుకు వెరవరు. ప్రతి పనిలో దూకుడు అధికం. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు. వ్యాపారులకు అత్యంతం చక్కని కాలం.




వృథా ఖర్చులు తయారుగా ఉంటాయి. ప్రతి అడుగు ఆచితూచి వేయడం మంచిది. నూతన ప్రారంభాలు తగవు. వాయిదా వేయడం మంచిది. నివాసాలు మార్చే అవకాశాలున్నాయి. ఆర్థిక విషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. వ్యాపారులు భాగస్వాములతో సఖ్యంగా ఉండడానికి ప్రయత్నించండి. రాజకీయులు పై వారిని విమర్శించకుండడం మంచిది.




ఆర్థికవిషయాలు అంతంతమాత్రమే. ముందుచూపుతో అడుగేయాలి. ప్రయాణాలు సుకరంగా ముగియవు. ప్రతి విషయంలో ఎదుటివారితో వాదాలకు దిగవద్దు. గుట్టుగా కాలం గడపడం మంచిది. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. భాగస్వాముల తోడ్పాటు బాగుంటుంది. ఎదురు చూసిన ఫలితాలు దక్కవు. విద్యార్థులకు విరోధాలెక్కువ. వృత్తిలో ఓర్పు అవసరం.

# సముద్ర తీరస్థ ప్రాంతమే తూర్పు దిగ్భాగం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*కె.ఉమామహేశ్వరి — గుంటూరు*

** రోడ్ల మలుపుల వల్ల కొన్ని ప్రాంతాల్లో ఉత్తర, దక్షిణాలు తూర్పు లాగా కనిపిస్తుంది?*

ఉత్తరాయణ, దక్షిణాయన కాలాల్లో కొన్ని ప్రాంతాల్లో సూర్యోదయం ఈశాన్య, ఆగ్నేయ ప్రాంతాల్లో జరిగినట్లనిపిస్తుంది. ఇవన్నీ భ్రమలు. బంగాళాఖాతం తూర్పు భాగానే వుంటుంది. సముద్ర తీరస్థం తూర్పు ప్రాంతంగా మనం గుర్తుంచుకోవాలి.

*సి.తిరువెంగళరావు — తిరుపతి*

** కుజుడు అధిపతి. నాకే స్థలం కలసి వస్తుంది?*

కుజుడు దక్షిణ దిశానువర్తి. అంచేత దక్షిణ స్థలం మీకు కలసి వస్తుంది.

*ఇరుగోళ్ల శాంభవి — నాయుడుపేట*

** శ్రావణం తర్వాత ఏ మాసాల్లో గృహ నిర్మాణం చేయవచ్చు.*

బాద్రపదం రోగం, ఆశ్వయుజం కలహం, మార్గశిరం కష్టం, పుష్యం భయం అన్నాయి శాస్త్రాలు. అంచేత కార్తీక మాసం, మాఘ, ఫాల్గుణాలలో గృహ నిర్మాణం లక్ష్మీకృత వాస్తు యంత్ర ప్రతిష్ట తర్వాత చేయవచ్చు.

*ఎం.హనుమంతరావు — రాపూరు*

** ఒకటి రెండు కాదు. అన్నీ సమస్యలే. పరిష్కారం చెప్పండి?*

ప్లాను, వ్యూఫోటోలు, జాతకం అన్నీ చూశాను. వాస్తు సవరణలు చేసుకోవాలి. ఈలోగా 'సుదర్శన' యంత్ర ప్రతిష్ట తాత్కాలిక రక్షణ కవచంలా పనిచేస్తుంది.

*ఎన్.వీరబ్రహ్మం — నెల్లూరు*

** పాత్రల వాడకాన్ని బట్టి రోగ నిర్మూలన విశ్వామిత్ర వాస్తులో ఉందంటారు.*

సృష్టికి ప్రతిసృష్టి చేసిన మహానుభావుడు విశ్వామిత్ర మహర్షి. ఆయన వశిష్ఠ మహర్షి నుంచి గ్రహించిన అంశాలను వాస్తు శాస్త్రం 4వ అధ్యాయంలో పొందుపరచాడు. బంగారం - జఠరాగ్నిని, వెండి - పైత్యాన్ని, మూత్రరోగాన్ని, కంచు రక్తపైత్యాన్ని హరిస్తుందని చెప్పారు.

*ఇ.వి.జ్యోత్స్నారెడ్డి — చెన్నై*

** రత్నధారణ తర్వాత అతనిలో చాలా మార్పు వచ్చింది.*

గురు గ్రహదోషం స్త్రీ ఆకర్షణలకు ప్రలోభాలకు లోను చేసింది. పుష్యరాగం(ఉచ్ఛ) ధారణ తర్వాత మార్పు వచ్చింది. అలాగే ఇంట్లో లక్ష్మీ గణపతి యంత్ర ప్రతిష్ట కూడా చేయండి.

*షేక్ రజియాబేగం — కర్నూలు*

** నేను అక్టోబరు 22వ తేది జన్మించాను. నా రాశి తులా రాశియా? వృశ్చిక రాశియా?*

ప్రాచీనులు ఈ రాశి కాలాన్ని 22 వరకూ; ఆధునికులు 23 వరకూ, ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్త 'చీరో' అక్టోబరు 20 వరకూ హద్దుగా నిర్ణయించారు. అయితే చిత్త, స్వాతి, విశాఖ నక్షత్రాలు తులరాశికే చెందుతాయి(లిబ్రా).

*ఎం.లిల్లీమేరీ — చేజర్ల*

** నా పేరు 'లిల్లీమేరీ'. నామ నక్షత్ర రాశి ఏది? ఆగష్టు 20 జన్మతేది. ఏ ఇల్లు కలసి వస్తుంది?*

నామాక్షరాన్ని బట్టి భరణి 4వ పాదం మేషరాశి, తేదీని బట్టి సింహరాశి వస్తున్నాయి. తేది గణింతమే కరెక్టు. సింహరాశికి సూర్యుడధిపతి. వీరికి తూర్పు దిక్కు స్థలం, ఇల్లు కలసి వస్తుంది. పేర్కొన్న సమస్యలకు 'సుదర్శన యంత్ర' ప్రతిష్ట ఉత్తమ ఫలితాలనిస్తుంది.

*వై.వి.రమణారెడ్డి — ఇందుకూరుపేట*

** యంత్ర ప్రతిష్ట తర్వాత ఆశలు వదలుకున్న అప్పులు కూడా వసూలయ్యాయి.*

యంత్రంలోని మంత్ర బీజాక్షరాలు చాలా శక్తివంతమైనవి. అందువల్లే అలా జరిగింది. మీకు జరిగిన అనుభవమే చాలా మంది ఈ మధ్య తెలియజేశారు.

# నెల్లూరు నర్సింగ్ కళాశాలల్లో నానా అఘాయిత్యాలు!

జిల్లాలో ఏర్పాటుచేసిన పలు నర్సింగ్ కళాశాలల్లో అఘాయిత్యాలు చోటు చేసుకుంటున్నాయి. ఈ సంస్థల్లో జరుగుతున్న సంఘటనలలో కొన్ని మాత్రమే బహిర్గతం అవుతుండగా, మరి కొన్ని మరుగున పడిపోతున్నాయి. వీటి నిర్వహణపై అధికార యంత్రాంగం పూర్తిస్థాయి దృష్టి సారించకపోవడంతో ఆయా సంస్థల యాజమాన్యాలు ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ శిక్షణ పొందుతున్న విద్యార్థినుల పట్ల వేధింపులకు పాల్పడుతున్నాయి. ముఖ్యంగా ఇతర రాష్ట్రాల నుంచి ఇక్కడకు వచ్చి శిక్షణ పొందుతున్న వారి పరిస్థితి దుర్భరంగా వుంటుంది.

### 150కి పైగా శిక్షణా కేంద్రాలు

జిల్లావ్యాప్తంగా దాదాపు 150కి పైగా నర్సింగ్ శిక్షణ కేంద్రాలు వున్నాయి. వీటికి అనుమతులు మంజూరు చేస్తున్న జిల్లా వైద్య, ఆరోగ్య శాఖ ఆ తర్వాత వీటి నిర్వహణపై ఎటువంటి పర్యవేక్షణ చేయడం లేదు. సంవత్సరానికి ఒకసారి మాత్రమే అడ్మిషన్ల సమయంలో సమావేశాలు నిర్వహించి చేతులు దులుపుకుంటుంది. జిల్లాకు చెందిన వారితోపాటు తమిళనాడు, కేరళ రాష్ట్రాలకు చెందిన బాలికలు నగరంలోని వివిధ నర్సింగ్ కళాశాలల్లో శిక్షణ పొందుతున్నారు. ఇతర రాష్ట్రాల నుంచి ఇక్కడకు రావడం, భాషపై అవగాహన లేకపోవడం వల్ల కూడా బాలికలు వేధింపులకు, వెకిలి చేష్టలకు గురికాబడుతున్నారు.

### అనుమానాస్పద మరణాలు

గతంలో నగరంలో వున్న నర్సింగ్ కళాశాలలో పలువురు బాలికలు అనుమానాస్పదంగా మృతి చెందిన సంఘటనలు వున్నాయి. ఈ మరణాలపై అనేక అనుమానాలు వున్నప్పటికి పోలీసులు సరైన దర్యాప్తు చేయకపోవడం, మృతుల తల్లిదండ్రులు దూర ప్రాంతాల్లో వుండడం కారణంగా ఇటువంటి సంఘటనలు మరుగునపడిపోతున్నాయి. నర్సింగ్ శిక్షణ పొందుతున్న విద్యార్థినులను ఆయాసంస్థల యాజమాన్య సుపుత్రులు,వారి స్నేహితులు, అక్కడ పని చేసే యువకులు లైంగిక వేధింపులకు గురి చేస్తుంటారు. లైంగిక వేధింపుల విషయం బయటపెడితే భవిష్యత్ నాశనం చేస్తామని కూడా బెదిరిస్తుంటారు.

దీంతో భయాందోళన చెందుతున్న విద్యార్థినులు నోరుమెదపకుండా మౌనంగా భరిస్తుంటారు. మరో ప్రక్క లక్షలాది రూపాయలు ఫీజులు చెల్లించి శిక్షణ పొందుతూ మధ్యలో నిలిచిపోతే తల్లిదండ్రులకు ఏం సమాధానం చెప్పాలో తెలియక ఇక్కడే కాలం గడుపుతున్నారు. వీరి బలహీనతను ఆసరా చేసుకొని మరిన్ని వేధింపులకు పాల్పడుతున్నారు. ఒక వేళ ఎవరైనా ధైర్యం చేసి ముందుకొస్తే వారిని ఏదో ఒక కారణంగా ఉత్తీర్ణత కాకుండా చేస్తుంటారన్న ఆరోపణలున్నాయి. నర్సింగ్ కళాశాలల యాజమాన్యాలు శిక్షణ పొందుతున్న వారికి సౌకర్యాలు కూడా సక్రమంగా కల్పించడం లేదు.

### వార్తల్లో విజయా నర్సింగ్ స్కూల్

గత వారంలో విజయా ఆసుపత్రికి అనుబంధంగా ధనలక్ష్మీపురం సమీపంలో వున్న నర్సింగ్ కళాశాలలో అన్నమ్మ అనే విద్యార్థిని తీవ్ర గాయాలకు గురై నారాయణ వైద్యశాలలో చికిత్స పొందుతోంది. ఈ విద్యార్థినిది కేరళ రాష్ట్రంలోని కొట్టాయం. నాలుగు సంవత్సరాల నర్సింగ్ శిక్షణ పొందుతున్న ఈ విద్యార్థినిని కరస్పాండెంట్ కారు డ్రైవర్ లైంగిక వేధింపులకు గురిచేసేవాడు. ఇతనికి లొంగకపోవడంతో అర్ధ రాత్రిపూట కళాశాలలోకి ప్రవేశించి విచక్షణారహితంగా ఆమెపై దాడి చేసి తీవ్రంగా కొట్టాడు. అడ్డువచ్చిన ఇతర విద్యార్థునులపై కూడా దాడి చేసి బెదిరించాడు.

అపస్మారక స్థితికి చేరుకున్న బాలికను నగరంలోని విజయా ఆసుపత్రికి చికిత్స నిమిత్తం తరలించారు. పరిస్థితి విషమంగా వుండడంతో నారాయణ ఆసుపత్రిలో ఐసియు విభాగంలో చికిత్స చేయిస్తున్నారు. బాలిక పొత్తికడుపుపై బలంగా కొట్టడం వలన గర్భాశయం దెబ్బతిన్నట్లు వైద్యులు నిర్ధారించారు. కేరళ నుంచి నగరానికి చేరుకున్న బాలిక తల్లిదండ్రుల్ని కూడా కళాశాల యాజమాన్యం అన్ని విధాలుగా బెదిరించినట్లు సమాచారం. నోరు మెదిపితే బాలిక ప్రాణాలతో బయట పడదని హెచ్చరించడంతో తల్లిదండ్రులు మౌనంగా వుండిపోయారు.



*వార్తల్లో నిలచిన ధనలక్ష్మీపురంలోని విజయ నర్సింగ్ కళాశాల.*

ఈ సంఘటన కూడా బహిర్గతం కాకుండా విజయా నర్సింగ్ కళాశాల యాజమాన్యం అన్ని జాగ్రత్తలు తీసుకున్నా కొందరు మలయాళీయుల కృషితో బయటకు పొక్కింది. మీడియా ప్రతినిధులకు సమాచారం అందించడంతో అక్కడకు వెళ్లిన మీడియా వారిని నారాయణ ఆసుపత్రి సిబ్బంది లోపలికి అనుమతించ లేదు. ప్రస్తుతం ఈ యువతి కోమాలో వుంది. ఈ సంఘటన కేవలం ఒక ఉదాహరణ మాత్రమే. ఇటువంటివి పలు నర్సింగ్ కళాశాలల్లో నిత్యం జరుగుతూనే వుంటాయి. ప్రభుత్వ నిబంధనలు పాటించని కళాశాలలు అనేకం వున్నాయి. శిక్షణ పేరుతో అధిక ఫీజులు వసూలు చేస్తున్న నర్సింగ్ కళాశాలలపై చర్యలు తీసుకోవడంతోపాటు, విద్యార్థినుల పట్ల వేధింపులకు పాల్పడకుండా జిల్లా అధికారులు తగిన చర్యలు తీసుకోవాలని బాధిత విద్యార్థినుల తల్లిదండ్రులు కోరుతున్నారు.

కుంభకోణం

# మూలపేట ఆంధ్రాబ్యాంక్‌లో నకిలీ బంగారం తాకట్టు!

నెల్లూరులోని మూలపేట ఆంధ్రాబ్యాంకులో నకిలీ బంగారం తాకట్టుపెట్టి దాదాపు 4లక్షల రూపాయల మేర రుణం పొందారు. ఈ కుంభకోణానికి అసలు సూత్రధారి అప్రైజర్ గణేష్ ప్రస్తుతం పరారీలో వున్నాడు. నలుగురి పేర్లతో 40సవర్ల నకిలీ బంగారం తాకట్టు పెట్టి గణేష్ ఈ మొత్తాన్ని రుణంగా తీసుకున్నాడు. తెలిసిన వారిని నమ్మకంగా మోసం చేసిన విషయం బయటపడడంతో అప్రైజర్ గణేష్ పరారైనాడు. ఈ సంఘటన జరిగి దాదాపు రెండు సంవత్సరాలు గడిచినా కూడా బహిర్గతం కాకుండా బ్యాంకు అధికారులు జాగ్రత్త పడ్డారు.

ఇదే బ్యాంకులో గణేష్ అప్రైజర్‌గా చాలా సంవత్సరాలు నుంచి విధులు నిర్వహిస్తున్నాడు. రైతులు, ఇతర ఖాతాదారులు తమ అవసరాల నిమిత్తం బంగారాన్ని బ్యాంకులో తాకట్టుపెట్టి రుణాలు తీసుకొనేవారు. బ్యాంకుకు వస్తున్న పలువురి ఖాతాదారులతో గణేష్ సన్నిహితంగా మెలిగేవాడు. ఈ సన్నిహిత కారణంగా నకిలీ బంగారం బ్యాంకులో తాకట్టుపెట్టి రుణం తీసుకోవాలని పన్నాగం పన్నాడు. దీంతో బ్యాంకుకు వచ్చే ఖాతాదారులతో చర్చించి తాను బ్యాంకులో పని చేస్తున్నందున రుణం ఇవ్వరని మీ పేరుతో బంగారం తాకట్టు పెట్టి రుణం తీసుకుంటానని నమ్మించాడు.

ఇందుకు అంగీకరించిన నలుగురు ఖాతాదార్లు తమ పేర్లతో నాలుగు లక్షల రూపాయలు రుణం పొందినట్లు సంతకాలు చేయడం జరిగింది. ఈ నాలుగు లక్షల రూపాయల్ని అప్రైజర్ గణేష్ వెంటనే తీసుకున్నాడు. కొన్ని నెలల తర్వాత రుణాన్ని తిరిగి చెల్లించమని బ్యాంకు అధికారులు నోటీసులు పంపడంతో ఖాతాదారులు ఆశ్చర్యపోయారు. బ్యాంకుకు వెళ్లి జరిగిన విషయాన్ని వివరించారు. అప్పటికే గణేష్ నగరం విడిచి పారిపోయాడు. బ్యాంకు అధికారులు బ్యాంకులో తాకట్టు పెట్టిన మొత్తం బంగారాన్ని తనిఖీ చేయడంతో 40 సవర్ల బంగారం నకిలీదని తేలింది. నకిలీ బంగారం తాకట్టుపెట్టిన విషయం బయట పడితే ఎక్కడ బ్యాంకు పరువు పోతుందోనని భావించిన అధికార్లు అన్ని జాగ్రత్తలు తీసుకొన్నారు. దీంతో రుణం పొందినట్లు సంతకాలు చేసిన ఖాతాదారులపై మరింత ఒత్తిడి ఎక్కువైంది. పోలీసు కేసు పెడతామని కూడా బెదిరించారు. భయపడిన ఖాతాదారులు నమ్మి సంతకం పెట్టినందుకు 4లక్షల రూపాయలు బ్యాంకుకు తిరిగి చెల్లించాల్సి వచ్చింది. బ్యాంకు అప్రైజర్‌గా వున్న గణేష్ నమ్మించి ఖాతాదారుల్ని, బ్యాంకును మోసం చేసిన సంఘటనపై బ్యాంకు అధికారులు పోలీసులకు ఫిర్యాదు చేయకపోవడం సందేహాలకు తావిస్తుంది.

బ్యాంకునే మోసగించిన అప్రైజర్‌పై చర్యలెందుకు తీసుకోలేదని ఖాతాదారులు ప్రశ్నిస్తున్నారు. మరికొందరు ఖాతాదారులైతే బ్యాంకు అధికారుల తీరుపై కూడా అనుమానం వ్యక్తపరుస్తున్నారు. నకిలీ బంగారం తాకట్టుపెట్టి రుణాలు పొందడంలో గణేష్ ఆరితేరాడు.

### కొత్తూరు ఆంధ్రాబ్యాంకులో...

ఆంధ్రాబ్యాంకుకు అప్రైజర్‌గా వుంటున్న గణేష్ ఇందుకూరుపేట మండలం కొత్తూరు ఆంధ్రాబ్యాంకులో ఇదే తరహాలో మోసానికి పాల్పడ్డాడు. మూలాపేట ఆంధ్రాబ్యాంకులో 4లక్షల రూపాయలు రుణంగా తీసుకుంటే కొత్తూరు ఆంధ్రాబ్యాంకులో 30లక్షల రూపాయలు తీసుకున్నాడు.

గణేష్ చేసిన మోసం కారణంగా 40మంది రైతులు తీవ్ర ఇబ్బందులకు గురయ్యారు. ఇక్కడ జరిగిన సంఘటన బహిర్గతం అయినా కూడా రైతుల్ని బ్యాంకు అధికారులు బాధ్యుల్ని చేయడం గమనార్హం.




*వివాదంలో నెల్లూరు మూలపేట ఆంధ్రాబ్యాంక్.*

ఈ సంఘటన జరిగి కూడా రెండు సంవత్సరాలు కావస్తున్నా ఇంకా ఒక కొలిక్కి రాలేదు. కొందరు బాకీలు చెల్లించగా మరి కొందరు ఆర్థిక పరిస్థితుల కారణంగా చెల్లించలేకపోయారు. రైతులు, ఖాతాదారులకు బాసటగా నిలవాల్సిన బ్యాంకు అధికారులు, రైతుల్ని వేధింపులకు గురి చేయడం బాధాకరం.

బ్యాంకులో ఏ చిన్న సంఘటన జరిగినా పూర్తిస్థాయి విచారణ జరపడం, పోలీసులకు ఫిర్యాదు చేస్తుంటారు. అయితే నకిలీ బంగారు తాకట్టుపెట్టి లక్షలాది రూపాయల్ని రుణంగా పొందిన అప్రైజర్ గణేష్‌పై ఎటువంటి చర్యలు తీసుకోలేదు. ఇప్పటికైనా బ్యాంకు యాజమాన్యం మోసపోయిన ఖాతాదారులు, రైతులకు న్యాయం చేయడంతోపాటు గణేష్‌పై కఠిన చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.

# హ్యాపీ హ్యాపీగా... పరమ బోరు!



✍ అల్లూరు రహీం

చిత్ర పరిశ్రమలో ఒకవర్గం యువహీరో వరుణ్ సందేశ్‌ను బాగా ప్రోత్సహిస్తోంది. ఆయన డైలాగ్ డెలివరీ, నటనలో పెద్ద ఈజ్ లేకపోయినా హ్యాపీడేస్ తర్వాత ఐదారు తెలుగు చిత్రాల్లో ఆయన హీరోగా నటించగలిగాడు. రంజిత్ మూవీస్ పతాకంపై వడ్లమూడి దుర్గాప్రసాద్ వరుణ్‌సందేశ్ హీరోగా నిర్మించిన హ్యాపీ హ్యాపీగా చిత్రంలోనూ సత్తాలేదు. ఈ చిత్రానికి పలు తమిళ చిత్రాలకు సహాయ దర్శకునిగా పనిచేసిన ప్రియశరణ్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు నిర్వహించాడు. దర్శకుని అనుభవరాహిత్యం దరిదాపులు ప్రతి ఫ్రేములోనూ కనిపించింది. వరుణ్ సందేశ్, వేగ, శరణ్యా మోహన్ వంటి నటీనటుల నుంచి నటనను రాబట్టడం ఆయన వల్ల కాలేదు. సీనియర్ నటుల్లో అలీ, ఎం.ఎస్.నారాయణ, రంజిత, బొమ్మాళీ రవి తమదైన ధోరణిలో తమ పాత్రలు పోషించుకపోయారు. మనల్ని ప్రేమించేవారికి మన ప్రేమను తప్పకుండా తెలియజేయాలని, వారి కోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధపడాలన్నది ఈ చిత్రంలో దర్శకుడు చెప్పాలనుకొన్నాడు. దీనికిగాను కథను నానా డొంకలు తిప్పాడు. ఆ తిరుగుడు బాగుందా అంటే అదీ సరి లేదు. ఆలీ, ఎంఎస్.నారాయణ, రంజిత కామెడీతో చిత్రం లాగే ప్రయత్నం చేశాడు. చిత్రంలో ప్రేమమయ భావాలు వ్యక్తమయ్యే సన్నివేశాలు మూడే మూడు. హీరోయిన్, హీరో తన ప్రేమలేఖల్లో తాను ప్రేయసితో కలిసి వుండాలని కోరుకొనే కన్యాకుమారిలోని సూర్యోదయ సన్నివేశం, తాజ్‌మహల్ దగ్గర కేరింతలు, భీమిలి బీచ్‌లో ఈసులు బాగున్నాయి. సీతారామశాస్త్రి సాహిత్యంలో మణిశర్మ సంగీతం కూర్చిన పుటుక్కు జర దుబుక్కుమే, మధురానుభవమే ప్రేమ పాటలు బాగున్నాయి. వివేకానంద వ్రాసిన మాటలు ఈ తరం ప్రేమికులకు కావాల్సిన తరహాలో వున్నాయి. ఫ్లవర్ ఇవ్వగానే లవర్ అయిపోవాలా? ఓ అమ్మాయి నో అంటే ఇబ్బంది పెట్టకుండా ఇంకో అమ్మాయిని చూసుకోవాలి. ఐస్ నీళ్ల కావడానికి, ప్రేమ పుట్టడానికి పెద్ద సమయం పట్టదు. మరణించనివాడు... ప్రేమించనివారు వుండరు ఈ కోవలోనివే. భీమిలి బీచ్, కన్యాకుమారి, తాజ్‌మహల్ అందాలను కెమెరామెన్ వెంకి ఎ దర్శన్ కొత్తకోణంలో చూపాడు.




ఇక చిత్రకథలోనికి వెళ్తే విశాఖపట్నంలో తన మిత్రులతో కలిసి సంతోష్(వరుణ్ సందేశ్) కార్టూన్ గాయ్స్ అనే సంస్థను నడుపుతుంటాడు. పుట్టినరోజులు, పెళ్లిరోజులు, విఐపిలకు స్వాగత, వీడ్కోలు సత్కారాల వంటి బాధ్యతలను ఈ సంస్థ చేపడుతుంటుంది. అనాథ అయిన సంతోష్‌కు సమాజంలో అభాగ్యులంటే ఎనలేని అభిమానం. లండన్ నుంచి వచ్చే డిసౌజ పూజ (వేగ)కు స్వాగతం చెప్పను తన బృందంతో సహా రైల్వేస్టేషన్‌కు వెళ్లే సంతోష్‌కు తొలిచూపులోనే ఆమె ఎంతగానో నచ్చుతుంది. సంతోష్ హార్దిక స్వాగతానికి పూజ సంతోషిస్తుంది. పూజను తాను అభిమానిస్తున్నట్లు ఎన్నోసార్లు చెప్పాలనుకొంటాడు సంతోష్. పూజ తల్లిదండ్రులు ప్రేమించుకొని పెళ్లిచేసుకొని విడిపోతారు. దీనివల్ల ఆమె ప్రేమ వ్యవహారాలంటే తనకు పడవని చెబుతుంది. పూజను ఉడికించను ఓ దేవాలయం దగ్గర ప్రియ (శరణ్యామోహన్)ను సంతోష్ చూపించి ఆమెను తాను ప్రేమిస్తున్నానని కాని ఈ విషయం చెప్పలేకపోతున్నానంటాడు. దీంతో పూజ ప్రియ దగ్గరకు వెళ్లి సంతోష్ సంకటాన్ని వివరిస్తుంది. అతను తనకిచ్చిన 50 ప్రేమలేఖలు ఆమెకిస్తుంది. ప్రియ విశాఖ రౌడీ సూరి (బొమ్మాళీ రవి) సోదరి. ఈ లేఖలు చదివి ప్రియ మనస్సు పులకిస్తుంది. చెల్లెలంటే ఇష్టపడే సూరి కూడా ఆమె ప్రేమకు ఓకే చెబుతాడు. ఓ అర్ధరాత్రి సంతోష్‌కు ఫోన్ చేసి పిలిపించే ప్రియ అతన్ని విమానంలో కన్యాకుమారి, ఆగ్రాలకు తీసుకెళ్తుంది. ప్రేమలేఖల్లో కోరిక తీర్చనే ఈ ప్రదేశాలకు తీసుకవచ్చానంటుంది. సంతోష్ కోరుకున్నట్లే భీమిలి బీచ్‌కు వర్షం పడుతుండగా బస్సులో ఎక్కిన ప్రియ స్లిప్ అయ్యి క్రిందపడి తీవ్ర రక్తస్రావమవుతుంది. ఈ సమయంలో సంతోష్‌లోని ప్రేమికుడు మేల్కొంటాడు. తన హృదయ పూర్వక ప్రేమను ఆమెకు తెలియజేస్తాడు. గుండెల నిండుగా సంతోష్ ప్రేమను నింపుకొన్న ప్రియ ప్రాణాలు విడుస్తుంది. చివరి క్షణంలో తాను చేసిన తప్పును పూజ తెలుసుకొన్నా సంతోష్ మనసంతా ప్రియ వుండడంతో విశాఖలో వుండలేక లండన్‌కు తిరిగి పయనమవడంతో చిత్రం ముగుస్తుంది.





తెలుగులోనూ ఒక చిత్రంలో నటించిన తనుశ్రీ దత్తా పేరు వినగానే ఆషిక్ బనాయా సినిమాలోని హాట్‌హాట్ పాటే గుర్తొస్తుంది. తనుశ్రీని బాలీవుడ్‌లో శృంగార దేవతగా నిలబెట్టిన పాట కూడా అదే. అందుకే ఈ అమ్మడు కూడా ఆ పాటని తేలిగ్గా మర్చిపోనంటుంది. నా కెరీర్‌ను ఆ గీతమే మలుపు తిప్పింది. అయితే

## నిలబెట్టిన హాట్‌పాట

ఇంట్లోవాళ్లు ఆ పాటను చూసి కాస్త ఇబ్బంది పడ్డారు. ఆ పాటను ఏ సందర్భంలో చేయవలసి వచ్చిందో వివరించాను. దాంతో ఇంట్లో వాళ్లు నన్ను అర్థం చేసుకున్నారు. నాకేదైనా సమస్య వస్తే ఇంట్లో వాళ్లతోనే చెప్పుకొంటాను. నేను నమ్మేది కూడా వాళ్లనే. వాళ్ల సలహాలు, సూచనలు తనకెంతో ఉపయోగపడ్డాయంది తనుశ్రీ.

## నటనతో రాణించాలి!



బాలీవుడ్ భామ ప్రియాంక చోప్రా అంచెలంచెలుగా పరిశ్రమలో అగ్రకథానాయికగా ఎదిగింది. పరిశ్రమలో రాణించాలంటే కొన్ని చిట్కాలు చెబుతుంది ఈ సుందరి. ముందు నటించడం రావాలి. అందంగా వున్నంత మాత్రాన హీరోయిన్‌గా నిలదొక్కోలేం. తొలిదినాల్లో అవకాశాలు రావడం గొప్ప. వైవిధ్యమైన పాత్రలు దొరికితే నక్కతోక తొక్కినట్లే. నటిగా ప్రేక్షకులు ఆదరించాక కొత్తదనం నిండిన పాత్రలు పోషిస్తే ప్రేక్షకులు చూస్తారు. ఆ పాత్రలో గొప్పదనం ఎక్కువమందికి చేరుతుందంటుంది ప్రియాంక.

## విక్రమ్‌లో మధనం

హీరో విక్రమ్ ఇప్పుడు ఆలోచనలో పడ్డారు. అపరిచితుడు తర్వాత ఆయన చేసిన చిత్రాలేవీ ప్రేక్షకుల్ని పూర్తి స్థాయిలో మెప్పించలేకపోయాయి. మల్లన్న వచ్చినా విక్రమ్‌లోని నటుడిని ఆవిష్కరించిందే తప్ప ప్రేక్షకులను రంజింప చేయలేదు. మణిరత్నం తీసిన రావణ్ పరిస్థితి అంతే. దీంతో విక్రమ్ ఆలోచనలో పడ్డాడు. ఓ కమర్షియల్ చిత్రంలో నటించను గ్రీన్‌సిగ్నల్ ఇచ్చాడు. విజయ్ అనే దర్శకుడు ఇటీవలే తీసిన మదరాసు పట్టణం సినిమా బాగా ఆడింది. కొత్త దర్శకుడు విజయ్ తనను బాగానే ప్రమోట్ చేయగలడన్న విశ్వాస్వాన్ని విక్రమ్ వ్యక్తం చేస్తున్నాడు.



## పెళ్లికెందుకు తొందర?

బాలీవుడ్‌లో సెక్సీసుందరి నేహా ధూపియా వ్యాపారవేత్త రిత్విక్ భట్టాచార్య ప్రేమ సాగరంలో మునిగి తేలుతున్నారు. అయితే పెళ్లికి మాత్రం ఇప్పుడప్పుడే తొందర లేదు అంటుంది నేహా. ఈ విషయమై వివరిస్తూ ఎవరిపనుల్లో వాళ్లం బిజీగా వున్నాం. నా అభిప్రాయాల్ని అతను గౌరవిస్తాడు. పరిస్థితులను అర్థం చేసుకొంటాడు. అందుకే ఏ విషయంలోనూ తొందర పడడం లేదు. సినిమాల్లో నేను మంచి పాత్రలే పోషించాను. కానీ ప్రచారం చేసుకోలేకపోయాను. అందుకే అనుకున్నంత పేరు సంపాదించుకోలేకపోయాను. సింగ్ ఈజ్ కింగ్ సినిమాలో నాది మంచి పాత్రే. చాలా సినిమాల్లో నాయికగా కనిపించినా నన్ను ఇంకా కొంతమంది సహాయనటిగానే చూస్తున్నారు. ఈ రంగంలో నాకెవరూ గాడ్ ఫాదర్స్ లేరు. నా స్వశక్తితోనే ఇంత దూరం వచ్చాను. ఇంకా సాధిస్తానని ఆత్మ విశ్వాసంతో చెప్పింది.

## పుకార్లు మామూలే!



కంగనా రనౌత్ మీద రోజుకో గాలికబురు బాలీవుడ్‌లో పుడుతోంది. దీనికి కారణం తన మీద ఈర్ష్యేనంటుంది ఈ అమ్మడు. నేను అందరి అమ్మాయిల్లా చదువుకొంటున్నా కాలేజీలో ఎవరితో ఒకరితో లింకు పెడతారు. గిట్టనివాళ్లు మన ప్రక్కనే వుంటారు. నేను పరిశ్రమలోకి వచ్చిన కొత్తలో నాకు చాలా మందితో సంబంధాలు అంటగట్టారు. మొదట అధ్యయన్ సుమన్‌తో ఆ తర్వాత ఆదిత్య పాంచోలి లాంటి వాళ్లతో ముడిపెట్టారు. అయినా ఇలాంటి కాకమ్మ కథలను నేను పట్టించుకోను. ఈ మధ్య డినోమోరియాతో లింకు పెట్టారు. నేను సర్జరీలు చేయించుకొన్నట్లు వ్రాశారు. ఇటువంటి విషయాలన్నీ కథానాయికల జీవితంలో మామూలేనంది కంగనా.

# నగరంలో అభివృద్ధి పనులు జరిగాయా?




వివేకా, మాదాల వెంకటేశ్వర్లు మధ్య వాగ్వివాదం.

నెల్లూరు నగరం రోజురోజుకు ఎంతో అభివృద్ధి చెందుతున్నదని వేల కోట్ల రూపాయల నిధులతో అభివృద్ధి కార్యక్రమాలను చేపడుతున్నామని అధికారపక్షం శాసనసభ్యులు చెప్పుకోగా, ప్రతిపక్షానికి చెందిన కమ్యూనిస్టు పార్టీ దానిని తీవ్రంగా ఖండించింది. అభివృద్ధి కాగితాల్లో తప్ప ఎక్కడా కన్పడటం లేదని దుయ్యబట్టిన వ్యవహారం నగరంలో చర్చనీయాంశమయ్యింది.

రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి విజయమహల్ గేటు ప్రాంతంలో సిమెంటు రోడ్డు శంకుస్థాపన సందర్భంగా నగరంలో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలను ఏకరవు పెట్టారు. అన్ని వీధుల్లో సిమెంటు రోడ్లు నాణ్యతతో నిర్మిస్తున్నామని చెప్పుకొచ్చారు. తెలుగుదేశం పాలనలో రోడ్ల నిర్మాణంలో అవినీతి జరిగిందని తమ పాలనలో అవినీతికి ఆస్కారం లేకుండా అభివృద్ధి పనులు చేపడుతున్నామన్నారు. దీనికి వివేకా వెంట తిరిగే నగర శాసనసభ్యుడు ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డి వంత పాడారు. ఆనం చొరవతో నగరంలో అభివృద్ధి బాగా జరుగుతున్నదని తాన తందాన అన్నారు.

దీనికి భిన్నంగా డిప్యూటీ మేయర్, సిపిఎం పార్టీ నేత మాదాల వెంకటేశ్వర్లు వివేకా తీరును తూర్పారబట్టారు. వేదాయపాళెంలో జరిగిన సిఐటియు సభలో ఆయన నగరాభివృద్ధిపై తీవ్ర విమర్శలు చేశారు. అభివృద్ధి నిరోధకుడు వివేకానందరెడ్డి. ఆయన స్వార్థ రాజకీయాల కారణంగా నెల్లూరు పేరుకు నగరమైనా అభివృద్ధి జరిగింది శూన్యం అన్నారు. గత 18 సంవత్సరాలుగా వివేకా నగరాన్ని భ్రష్టుపట్టించాడని, అభివృద్ధి పనుల పేరుతో అవినీతికి పాల్పడ్డారని విమర్శించారు. డిఎఫ్ఐడి నిధులు రాకుండా పోవడానికి ఆయనే కారణమన్నారు. మాట మాట్లాడితే అభివృద్ధి పేరు చెప్పే వివేకా నిజంగా అభివృద్ధి ఎక్కడ జరిగిందో చెప్పాలన్నారు. నెల్లూరు నగరంలో ఏం జరుగుతుందన్న విషయం జనానికి తెలుసు. స్పందించాల్సిన సమయంలో స్పందిస్తారు.

# ఐటిడిఏలో అవకతవకలు

## ఆడిట్‌లో బయటపడ్డాయి



అవినీతి నిలయం – నెల్లూరులోని ఐటిడిఏ కార్యాలయం.

జిల్లా సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ(ఐటిడిఎ)లో జరిగిన నిధుల దుర్వినియోగంపై అంతర్గతంగా ఆడిట్ జరిగింది. చిత్తూరు, కడప, నెల్లూరు, ప్రకాశం జిల్లాల్లో వున్న గిరిజనుల సంక్షేమం కోసం వినియోగించాల్సిన నిధుల్ని వివిధ బ్యాంకుల్లో డిపాజిట్లు చేశారు. సంక్షేమ పథకాల అమలుకు నిధుల కొరత వుందని సాకు చూపుతూ ఈ కార్యాలయ అధికార్లు తమ అవసరాలకు మాత్రం కొరత లేకుండా చూసుకొంటున్నారు. నిధుల దుర్వినియోగంపై గిరిజన సంక్షేమ శాఖ అంతర్గతంగా ఆడిట్ చేయించడం జరిగింది. నిబంధనలకు విరుద్ధంగా బ్యాంకుల్లో 7 కోట్ల 50 లక్షల రూపాయల్ని డిపాజిట్ చేసినట్లు ఆడిట్‌లో తేలింది. అంతేకాకుండా గడిచిన రెండు సంవత్సరాలకుగాను అద్దె వాహనాల వినియోగానికి దాదాపు 25 లక్షల రూపాయల్ని చెల్లించినట్లు గుర్తించారు. ప్రాజెక్టు అధికారిగా వున్న రమేష్‌పై అనేక ఫిర్యాదులు ప్రభుత్వానికి అందాయి. ఈయన బాధ్యతలు చేపట్టిన తర్వాత జరిగిన నిధుల దుర్వినియోగంపై అవినీతి ఆరోపణలకు సంబంధించిన ఫిర్యాదులపై రాష్ట్ర ప్రభుత్వం విచారణకు ఆదేశించే అవకాశం వుంది.

# గజిబిజి గందర గోళం

## ఇందిరమ్మ ఇళ్ల లెక్కలు తేల్చడం కష్టం

జిల్లాలో ఎంతో ప్రతిష్టాత్మకంగా చేపట్టే ఇందిరమ్మ గృహ నిర్మాణ పథకంలో అనేక అవకతవకలు చోటుచేసుకున్న సంగతి తెలిసిందే. పక్కా గృహాలు వేగవంతంగా పూర్తి చేయడంలో నిర్లక్ష్యంగా వ్యవహరించిన గృహనిర్మాణ శాఖ అధికారులు సభలు, సమావేశాల్లో లెక్కలు చెప్పడంలో కూడా సరైన విధానం పాటించడం లేదు. ఇళ్ల నిర్మాణం, లబ్దిదారులు, బ్యాంకు, పోస్టాఫీసుల్లో తెరచిన ఖాతాల సంఖ్యను వెల్లడించడంలోనూ పప్పులో కాలేస్తున్నారు. ఇందిరమ్మ పథకం ద్వారా మొదటి, రెండవ, మూడవ విడతలలో లక్షా 88వేల 50 పక్కా గృహాలు మంజూరైనాయి. వీటిలో 79,225 గృహాల పనులు ప్రారంభించగా 58,555 గృహాలను పూర్తిచేశారు. 20,673 గృహాలు ప్రగతిలో వున్నాయి. అసలు ప్రారంభంకాని గృహాలు 29,625 వున్నాయి. గృహ నిర్మాణ శాఖ అధికారులు చెబుతున్న లెక్కల ప్రకారం 20,673 మంది బ్యాంకు, పోస్టాఫీసులలో నగదు చెల్లింపుకు సంబంధించి ఖాతాలు ప్రారంభించాల్సి వుంది. ఈ శాఖ వెల్లడించిన నివేదికలో 38,545 మందికి ఖాతాలు ప్రారంభించాలని, వీరిలో ఇప్పటికే 24,972 ఖాతాలు తెరచినట్లు వుంది. ఇంకా 13,573 మందికి ఖాతాలు తెరవాలని ప్రకటించారు. అదనంగా 17,872 మందిని ఎక్కడ నుంచి జాబితాలో చేర్చారో మాత్రం వెల్లడించలేదు. మొత్తం మీద గృహ నిర్మాణ శాఖ అధికారులు రూపొందించిన నివేదికలో చోటుచేసుకున్న లోపాలను ఎవరు గుర్తించకపోవడం విశేషం.



అమ్మకానికి సిద్ధమైన సేమియాలు.

# నెల్లూరుకు రంజాన్ కళ!

నెల్లూరు నగరంలో రంజాన్ కళ కన్పడుతోంది. ముస్లింలకు పవిత్రమైన రంజాన్ మాసంలో చంద్ర దర్శనంతో రంజాన్ ఉపవాస దీక్షలు ప్రారంభం అవుతాయి. కఠినంగా వుండే ఈ ఉపవాస దీక్షలను రోజా అంటారు. ప్రతి ఉదయం సూర్యోదయానికి ముందు, సాయంత్రం

## ఈద్‌ను పురస్కరించుకొని ముస్లింలు బిజీ

సూర్యాస్తమయానంతరం మాత్రమే ఆహారం తీసుకొంటూ అత్యంత భక్తిశ్రద్ధలతో ముస్లిం సోదరులు జీవనం గడుపుతారు. మిగతా రోజుల్లో ఎలా వున్నా రంజాన్ నెలలో ఐదు పూటలా నమాజు చేస్తారు. నమాజుకు ముందు చేసే వజులో దంతాలను శుభ్రపరచుకొనేందుకు మిశ్వాక్ అనే చెట్టు వేరును వినియోగిస్తారు. నమాజు సమయాల్లో ధరించేందుకు ప్రత్యేకమైన టోపీలను అమ్ముతారు. దేశవాళీ టోపీల తోపాటు బంగ్లాదేశ్, ఇండోనేషియా, చైనా, జపాన్ దేశాల నుంచి వీటిని దిగుమతి చేసుకొని అమ్ముతారు వ్యాపారులు. ఇక రంజాన్ నెలలో సేమియా అమ్మకాలు విరివిగా వుంటాయి. ముస్లింలు ఈ మాసంలో చేసే సాంప్రదాయ వంటకాలైన దూద్‌కే సేమియా, దమ్‌కే సేమియా తదితర వాటికిగాను సేమియా కొనుగోళ్లు అధికమయ్యాయి. పండుగ పక్షం రోజులున్నా డైకస్ రోడ్డు, పెద్దబజారుల్లో పెద్ద సంఖ్యలో సేమియా అంగళ్లు వెలిశాయి.



చిరంజీవి పుట్టిన రోజును పురస్కరించుకొని రక్తదానం చేస్తున్న ఆయన అభిమానులు.

# చిరంజీవి అభిమానులకు ఎస్పీ అభినందన!

## రక్తదానం ప్రాణదానంతో సమానమని కితాబు.

ప్రజారాజ్యం పార్టీ అధినేత, సినీ హీరో చిరంజీవి 56వ జన్మదిన వేడుకలను ఆయన అభిమానులు, ప్రజారాజ్యం పార్టీ కార్యకర్తలు నగరంలో ఘనంగా నిర్వహించారు. ప్రతి ఏడాదిలాగనే ఈ సంవత్సరం కూడా చిరంజీవి అభిమాన సంఘం ఆధ్వర్యంలో భారీ రక్తదాన శిబిరం జరిగింది.

విఆర్ కళాశాలలో జరిగిన ఈ రక్తదాన శిబిరం ప్రారంభోత్సవానికి జిల్లా ఎస్పీ దామోదర్, ప్రజారాజ్యం పార్టీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి హాజరయ్యారు. రక్తదానం ప్రాణదానంతో సమానమని, ఎంతో పుణ్యం కల్గించే ఇలాంటి కార్యక్రమాలను చేస్తున్న చిరంజీవి అభిమానులను ఎస్పీ అభినందించారు. ఇంకా పలువురికి రక్తదానంపై అపోహలున్నాయని వాటిని తొలగించాలన్నారు. ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి మాట్లాడుతూ ఎనిమిదేళ్ల క్రిందట చిరంజీవి బ్లడ్ బ్యాంక్, ఐ బ్యాంక్‌లను స్థాపించారని, ఆయన స్ఫూర్తితో అభిమానులు రక్తదానం చేస్తున్నారంటూ కొనియాడారు. ఈ కార్యక్రమంలో చిరంజీవి అభిమానులు చంద్రశేఖర్‌రెడ్డి, కృష్ణారెడ్డి, వెంకటేశ్వర్లు, రవి తదితరులు పాల్గొన్నారు.

## దారులన్నీ మూసుకొన్నాయి

మొదటి పేజీ కొరవ

చేతిలో పెట్టి వచ్చేయమని చిలక్కు చెప్పినట్లు చెప్పి చూశారు. సోనియాగాంధీ, అహ్మద్ పటేల్, వీరప్ప మొయిలీ వంటి వారంతా రకరకాల మార్గాల్లో ఈ హిత వచనాలు పలికారు. కొండకచో హెచ్చరికలు కూడా చేశారు. కానీ జగన్ వాటన్నిటినీ తాటాకు చప్పుళ్లుగా తీసిపారేశాడు. నా యాత్ర నా ఇష్టం అన్న ధోరణిలో, అధిష్టానం నుంచి హెచ్చరికలు వచ్చిన తర్వాత పులివెందులలో తిరిగాడు. ఎమ్మెల్యేలను వెంట బెట్టుకొన్నాడు. ఆ జిల్లా మంత్రి అహ్మదుల్లాను బెదరించి, తమ పక్కన నిలబెట్టుకోవాలని చూశాడు. దానితో ఢిల్లీ పెద్దలకు చిర్రెత్తుకొని వచ్చింది. కెవిపిని పిలిచి తలవాచేలా చీవాట్లు పెట్టారు. ఎంతవరకు నిజమో కానీ స్వయాన రాహుల్ గాంధీ ఒక ఎమ్పీ దగ్గర జగన్ తీరును నిరసించినట్లు, ఇటువంటి వారిని సహించే కంటే ఒక రాష్ట్రంలో పార్టీకి నష్టం వచ్చినా భరించడం మంచిదని వ్యాఖ్యానించినట్లు 'ఆంధ్రజ్యోతి' దిన పత్రికలో వార్త వచ్చింది. కెవిపితో అహ్మద్ పటేల్ మాటల తీరు కూడా అదే రీతిలో సాగిందని వినికిడి.

### రింగ్ లీడర్ పనబాక

మరొకప్రక్క కాంగ్రెస్‌లో సాధారణ నేతలు కూడా జగన్ పట్ల తమ అసహనాన్ని బహిరంగంగా ప్రదర్శించడం మొదలు పెట్టారు. ఈ వర్గానికి రింగ్ లీడర్ పనబాక లక్ష్మి కావడం గమనార్హం. జగన్ ఇదే పద్ధతిలో కొనసాగడాన్ని ఎక్కువ కాలం అనుమతిస్తే, కాంగ్రెస్ కార్యకర్తలలో, మరీ ముఖ్యంగా యువకులలో గందరగోళం నెలకొని, పార్టీ నష్ట పోయే ప్రమాదం వుందని పనబాక, మరొక కేంద్ర మంత్రిణి పురంధరేశ్వరి, గుంటూరు ఎమ్పీ రాయపాటి సాంబశివరావు వంటి వారంతా అధిష్టానానికి మొర పెట్టుకొన్నారు. జగన్ పట్ల ఖచ్చితమైన వైఖరి అవలంభిస్తే తప్ప వూగిసలాటలో వున్న ఎమ్మెల్యేలు, మంత్రులు దారికి రారని వీరి వాదన. దానితో అధిష్టానం ఏకీభవించినట్లే కన్పిస్తున్నది. తమకు వ్యతిరేకంగా ఢిల్లీలో చాడీలు మోసే వారిని బెదరించడానికి పురంధరేశ్వరిని లక్ష్యంగా తీసుకొని దాడులు మొదలు పెట్టించాడు జగన్. ఆమె దిష్టి బొమ్మలు తగలబెట్టడం, పరుషమైన పదజాలంతో తిట్ల దండకం సాగించడం చేస్తున్నారు. మరొకప్రక్క అధిష్టానం సలహా మేరకు ఓదార్పు యాత్రకు దూరం జరగాలని తలపోసిన ప్రకాశం జిల్లా ఎమ్మెల్యేల మీద కూడా ఇదే తీరులో దాడులు జరిపిస్తున్నారు. గ్రామాలలో వారి మీదకు కార్యకర్తలను ఉసికొల్పుతున్నారు. జగన్‌తో కలిసి నడవకుంటే వీధులలో తిరగలేరన్న భయోత్పాతం సృష్టించే ప్రయత్నం చేస్తున్నారు. రాజకీయ మాఫియాను తలపింప చేసే ఈ పోకడ ఢిల్లీ పెద్దలకు తీవ్ర ఆగ్రహం తెప్పిస్తున్నది. డిసెంబర్ వరకు ఆగాలన్న వ్యూహం ప్రకారం నడిస్తే ఎమ్మెల్యేలు భయపడిపోతారని, కార్యకర్తలు చేజారి పోతారని ఆందోళన చెందుతున్నది అధిష్టానం. అందుకు విరుగుడుగా జగన్‌కు వత్తాసు పలుకుతున్న మంత్రులు, ఎమ్మెల్యేల మీద బహిష్కరణ వేటు వేయాలన్న ఆలోచనలో వుంది.

### జగన్‌కు వేరే దారి లేదు

అదే జరిగితే, జగన్ తొందరపడక తప్పదు. తనను వదలి పెట్టి, తన వారిని లక్ష్యంగా చేసుకోవడం ఆయనకు సంకటం కల్గించే అంశం. తనకు మద్దతు పలికారన్న కారణంతో పార్టీ నుంచి బహిష్కృతులయ్యే వారికి అండగా నిలవక తప్పదు. అది ఎట్లా అన్నదే సమస్య. అధిష్టానంతో మాట్లాడి వారి మీద బహిష్కరణ వేటు తప్పించాలని చూస్తే, రాజీ ప్రతిపాదన క్రింద వస్తుంది. అది జగన్‌కు ఎంత మాత్రం ఇష్టం లేదు. రాజీ అర్థం ఢిల్లీ పెద్దలకు తలదించుకొని బ్రతకడం మాత్రమే. అది జగన్‌కు ఎంత మాత్రం ఇష్టం లేదు. ఇప్పుడు తల దించుకొంటే, ఇక జీవిత కాలం దించుకొనే బ్రతక వలసి వస్తుందని ఆయన భయం. ఇక మిగిలిన దారి, తన వారిని వెంట బెట్టుకొని వేరు కుంపటి పెట్టుకోవడం మాత్రమే. అది మినహా తతిమాదారులన్నీ మూసుకొని పోయాయి.

### చివరకు మిగిలేది?

అయితే కొత్త పార్టీ పెట్టి ఇప్పటికిప్పుడు సాధించేది ఏదీ లేదు. తనతో వచ్చే ఎమ్మెల్యేల సంఖ్య ఎంత సాగదీసినా పాతిక ముప్పై దాటేట్లు కన్పించడం లేదు. అంత మేర నష్టం రోశయ్య ప్రభుత్వానికి చేటు కాదు. అందువల్ల ఆయన 2014 వరకు నిక్షేపంగా రాజ్యం చేస్తాడు. ప్రభుత్వాన్ని తక్షణం కూలగొట్ట గలిగితేనే జగన్‌కు ప్రయోజనం. కానీ అది జరిగేట్లు కన్పించడం లేదు. ఇంత ఆగం చేసి, చివరకు ఆయన మిగుల్చుకోగల్గిన రాజకీయ ప్రయోజనం శూన్యంగా మారుతుంది.

### 600 కోట్లు 100 సీట్లు

జగన్ ఆశ – ఎన్నికలను తెప్పించి, కాంగ్రెస్‌ను మట్టి కరిపించడం. 2014 వరకు ఎదురు చూసే ఓర్పు ఆయనలో లేదు. ఇప్పటికిప్పుడు ఎన్నికలు వస్తే, తాను కనీసం 600కోట్ల రూపాయలు ఖర్చు పెడతానని, అంత భారీ మొత్తం వ్యయం చేయడం ద్వారా అధమపక్షం 100 మంది ఎమ్మెల్యేలను గెలిపించుకొంటానని చెప్పున్నాడు జగన్. ఆ మాత్రం సంఖ్య తన పక్కన వుంటే, అధిష్టానం దోగాడుతూ వచ్చి తనకు ముఖ్యమంత్రిత్వం కట్టబెడుతుందన్నది ఆశ. కానీ అది అడియాస అయ్యే సూచనలే ఎక్కువగా వున్నాయి.




## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

నన్నారు. ఈ కార్యక్రమంలో పిసిసి కార్యదర్శి ఉడతా వెంకట్రావు, పిసిసి బిసిసెల్ కన్వీనర్ కె.రఘు రామ్, మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ, మాజీ జడ్పీచైర్మన్ చెంచలబాబు యాదవ్ తదితరులు పాల్గొన్నారు.

### కాంగ్రెస్ పెళ్లి!

నెల్లూరు సిటి కాంగ్రెస్ ఇన్‌ఛార్జ్, రాజీవ్ భవన్ స్థాపకుడు డాక్టర్ పోలుబోయిన అనిల్ కుమార్ వివాహం ఈ వారంలో నెల్లూరులో జరిగింది. పెళ్లి వేదిక, స్వాగతద్వారం, భోజనశాల అన్నింటా కాంగ్రెస్ మార్కు మూడురంగులు కొట్టొచ్చేలా చేసిన డెకరేషన్ ఆకట్టుకొంది. కాంగ్రెస్ పార్టీలో వుండి పెద్దపెద్ద పదవులు, ఆర్థిక లాభాలు పొందిన వ్యక్తులు కూడా ప్రదర్శించని కాంగ్రెస్ భక్తిని ప్రదర్శించిన యంగ్‌లీడర్ తీరు అందర్నీ ముగ్ధుల్ని చేసింది.

### క్రీడాప్రాధికార సంస్థలో మేలిమి రత్నం శాంతి!

ఇటీవల వియత్నాంలో జరిగిన ఆసియా అంతర్జాతీయ జూనియర్ అథ్లెటిక్స్ ఛాంపియన్ షిప్‌లో భారతజట్టుకు ప్రాతినిధ్యం వహించడంతోపాటు వ్యక్తిగతంగా రెండు పతకాలు పొందిన క్రీడాకారిణి సిహెచ్.శాంతిని జిల్లాకలెక్టర్ రాంగోపాల్ తన ఛాంబర్‌లో సత్కరించి 50వేల రూపాయల చెక్కు అందజేశారు. ఎసి.సుబ్బారెడ్డి స్టేడియంలో జిల్లా క్రీడాప్రాధికార సంస్థ నిర్వహించే బాలికల క్రీడా అథ్లెటిక్స్ అకాడమిలో శిక్షణ పొందిన క్రీడాకారిణి శాంతి. ఈమె దేశీయంలో జరిగిన పలు పరుగుపందాలలో బహుమతులు పొందింది. వియత్నాంలో జరిగిన ఆసియా అంతర్జాతీయ జూనియర్ అథ్లెటిక్స్ ఛాంపియన్ షిప్‌లో 200 మీటర్ల పరుగు పందెంలో మూడవ స్థానంలో నిలిచి కాంస్య పతకాన్ని, 400 మీటర్ల రిలే పరుగు పందెంలో ద్వితీయ స్థానంలో నిలిచి వెండి పతకం సాధించింది. ఢిల్లీలో జరుగబోయే కామన్ వెల్త్ క్రీడల్లో పాల్గొని ఈమె మరెన్ని పతకాలు పొందాలని కలెక్టర్ ఆకాంక్షించారు. పలు వివాదాలలో కూరుకున్న నెల్లూరు క్రీడా ప్రాధికార సంస్థలో విరబూసిన రత్నంగా శాంతిని అభివర్ణించవచ్చు.

### మేయరా... మజాకానా!

కేవలం ఏడాదిపాటు పదవిలో వున్నా మేయర్ భానుశ్రీ బాగా రాటు తేలిపోయారు. ఆమె నివాసం వుండే శోధన్‌నగర్ ప్రాంతంలో ఒక్క దోమ కూడా కనపడకూడదని కార్పొరేషన్ ఆరోగ్యశాఖాధికారులకు ఆమె హుకుం జారీ చేయడంతో వారు రోజుకు ఐదారుసార్లు పొగమందు వదులుతున్నారు. దీంతో ఈ ప్రాంతవాసులకు ఊపిరాడక ఉక్కిరిబిక్కిరవుతున్నారు. మేయర్ తన వీధిపైనేగాక నగరంలో వున్న అన్ని వీధులలో దోమలు లేకుండా హుకుం జారీ చేస్తే బాగుంటుందేమో!

### ఇంజనీరు రామసుబ్బారెడ్డి మరణం



నెల్లూరు మునిసిపల్ ఇంజనీరుగా సుదీర్ఘ కాలం సమర్ధవంతమైన సేవలు అందించిన రామసుబ్బారెడ్డి 22తేది మరణించారు. నెల్లూరు ప్రజలు చిరకాలం గుర్తుపెట్టుకోవాల్సిన అధికారి ఆయన. టౌన్ మంచినీటి సమస్యకు శాశ్వత పరిష్కారం వెతకడంలో రామసుబ్బారెడ్డి చూపిన ముందు చూపు అభినందనీయమైనది. కిసాన్‌నగర్, హరనాథపురం, పొదలకూరు రోడ్డు తదితర మంచినీటి రిజర్వాయర్లన్నీ ఆయన ప్రణాళికలో ఒక భాగం. నెల్లూరు చెరువును సమ్మర్ స్టోరేజి ట్యాంక్‌గా మార్చు చేయాలన్నది కూడా రామసుబ్బారెడ్డి ప్రతిపాదనే. పాత టౌన్‌లో తారు రోడ్ల బదలు సిమెంట్ రోడ్లు వేయాలన్న ఆలోచన సైతం ఆయనదే. నెల్లూరును పౌరసౌకర్యాల విషయంలో ఆదర్శప్రాయంగా తీర్చి దిద్దాలని తపన పడేవాడు. రాష్ట్రంలోని చాలా మంది మునిసిపల్ ఇంజనీర్లు సలహాల కోసం ఆయన దగ్గరకు వస్తుండేవారు.

ఆయనకు ఇద్దరు కుమారులు. ఇద్దరూ అమెరికాలోనే స్థిరపడ్డారు. వారి కుటుంబానికి మా సానుభూతి.

## జనవాణి

2వ పేజీ కొరవ

ఆరోగ్య వాతావరణంలో కళకళలాడుతూ సస్యశ్యామలంగా వుండే గ్రామాలు ప్రస్తుతం కాలుష్యంతో కొట్టుమిట్టాడుతున్నాయి. గ్రామీణ పారిశుధ్యంపై జిల్లా కలెక్టర్, జడ్పీ చైర్మన్ శ్రద్ధ పెట్ట మనవి.

సి.వి.సుబ్బయ్య అనుమసముద్రంపేట

### కళాకారులకు ఫించన్ పెంచండి!

కళాకారులుగా జీవితాంతం కళారంగానికి చేసిన సేవలకు గుర్తింపుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కొంతమంది వృద్ధ కళాకారులకు ప్రస్తుతం చెల్లిస్తున్న వృద్ధాప్య ఫించను 500 రూపాయల నుండి వెయ్యి రూపాయలకు పెంచమనవి. నిత్యావసర వస్తువుల ధరలు పెరిగి సామాన్యుడి బ్రతుకు భారమైన నేటి పరిస్థితులలో కళాసేవకే అంకితమైన పేద, వృద్ధ కళాకారుల ఫించన్‌ను పెంచితే బాగుంటుంది. అదేవిధంగా ఇంకా ఫించన్ అందని అర్హులైన వృద్ధ కళాకారులను గుర్తించి వారికి ఫించన్ల మంజూరుకు ప్రభుత్వం ప్రయత్నించాలి.

దొర్నాల హరిబాబు నెల్లూరు

● జిల్లాలో అసంతృప్తి మిగిల్చిన

# శ్రీకృష్ణ కమిటీ పర్యటన



ఈదూరు పట్టపుపాళెంలో మాట్లాడుతున్న శ్రీకృష్ణ కమిటీ సభ్యుడు అబూసలే షరీఫ్.

తెలంగాణ – సమైక్యాంధ్ర ఉద్యమాల నేపథ్యంలో కేంద్ర ప్రభుత్వం జస్టిస్ శ్రీకృష్ణకమిటీని ఏర్పాటు చేసింది. రాష్ట్రంలోని ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిస్థితుల్ని అధ్యయనం చేసే బాధ్యతలను ఈ కమిటీకి అప్పగించింది. రాష్ట్రంలోని అన్ని జిల్లాల్లో పర్యటిస్తూ ప్రజల నుంచి అభిప్రాయాలను సేకరిస్తుంది. రాష్ట్ర పర్యటనలో భాగంగా జస్టిస్ శ్రీకృష్ణకమిటీ ఈనెల 19, 20 తేదీలలో నెల్లూరు జిల్లాలో పర్యటించింది. 19వ తేది కావలి, అనుమసముద్రంపేట, టి.పి.గూడూరు మండలంలోని ఈదూరు పట్టపుపాళెం గ్రామాలలో పర్యటించింది.

కమిటీ సభ్యులు అబూసలె షరీఫ్, బి.ఎల్.జోషిల జిల్లా పర్యటనను జిల్లా అధికారులు చాలా గోప్యంగా వుంచారు. జిల్లాకు ఏ అధికారి గాని, మంత్రులు గాని పర్యటనకు వచ్చిన సమయంలో మీడియాకు ముందస్తు సమాచారం అందించే సమాచార, పౌరసంబంధాలశాఖ అధికార్లు శ్రీకృష్ణకమిటీ పర్యటన సమాచారం మాత్రం అందించలేదు. మీడియా ప్రతినిధులకు కమిటీ సభ్యులు వచ్చే సమయం తెలియక గంటల తరబడి నిరీక్షించాల్సి వచ్చింది. 19వ తేది కావలి, అనుమసముద్రంపేట ప్రాంతాల్లో పర్యటించి మధ్యాహ్నం 3 గంటలకు నెల్లూరు నగరానికి చేరుకున్నారు.

భోజన విరామం తర్వాత 4 గంటలకు బయలుదేరి టిపి.గూడూరు మండలంలోని ఈదూరు పట్టపుపాళెంకు వెళ్లారు. అక్కడ ముందుగానే అధికార్లు కమిటీ సభ్యుల రాకకోసం అన్ని ఏర్పాట్లు చేశారు. గ్రామస్తులతో ఏర్పాటుచేసిన సమావేశంలో ఇక్కడి గ్రామస్తులు రాష్ట్రాన్ని విభజించవద్దని శ్రీకృష్ణకమిటీ సభ్యులకు విజ్ఞప్తి చేశారు. ఈ మండలంలో, జిల్లాలోని ఇతర మండలాల్లో జరిగిన అభివృద్ధి, సంక్షేమ కార్యక్రమాలను పరిశీలించకుండానే కమిటీ సభ్యులు పర్యటన ముగించారు.

ఈదూరు పట్టపుపాళెంలో అర్ధ గంటలో సమావేశం ముగించి సమీపంలోని కోడూరు బీచ్‌కు వెళ్లి కొద్దిసేపు సేద తీరారు. సాయంత్రం కావడం వల్ల తిరిగి నగరంలోని పినాకిని అతిధి గృహానికి చేరుకుని రాత్రి బస చేశారు. 20వ తేది గూడూరు డివిజన్‌లోని శ్రీహరికోట అంతరిక్ష పరిశోధన కేంద్రాన్ని సందర్శించి స్థానిక అధికారులతో చర్చించారు. కమిటీ సభ్యుల వెంట జిల్లా జాయింట్ కలెక్టర్ సౌరభ్ గౌర్, నెల్లూరు ఆర్డీఓ వేణుగోపాలరెడ్డి, గూడూరు ఆర్డీఓ రామ్మూర్తి ఇతర అధికారులు పాల్గొన్నారు.

## ప్రజాసంఘాలు నిరీక్షణ

జిల్లా పర్యటనకు వచ్చిన శ్రీకృష్ణ కమిటీ సభ్యులు అబూసలె షరీఫ్, బి.ఎల్.జోషిలకు వినతిపత్రాలు అందజేసేందుకు వివిధ ప్రజాసంఘాలకు చెందిన నేతలు నగరంలోని పినాకిని అతిధిగృహం వద్ద గంటల తరబడి వేచి చూడాల్సి వచ్చింది. మధ్యాహ్నం 1.30 గంటలకు వస్తారన్న సమాచారం అందడంతో వారంతా ముందుగానే చేరుకున్నారు.

అయితే కమిటీ సభ్యులు రెండు గంటల ఆలస్యంగా నగరానికి చేరుకున్నారు. కమిటీ సభ్యులు ప్రజాసంఘాల నుంచి వినతి పత్రాలను స్వీకరించేందుకు ముందు నిరాకరించారు. ప్రజాసంఘాల నుంచి ఒత్తిడికి ఎక్కువ కావడంతో చివరకు అతిధి గృహం నుంచి పర్యటనకు బయలుదేరే సమయంలో బలవంతంగా వినతి పత్రాలు స్వీకరించక తప్పలేదు. శ్రీకృష్ణకమిటీ సభ్యులు జిల్లాలో జరిపిన రెండు రోజుల పర్యటన పట్ల పలు రాజకీయ పక్షాలు, ప్రజాసంఘాలు అసంతృప్తి వ్యక్తం చేశాయి. ప్రజల నుంచి గాని, రాజకీయ పక్షాల ప్రతినిధుల నుంచి గాని వినతి పత్రాలు స్వీకరణకు సమయం కేటాయించక పోవడం విమర్శకు దారితీసింది.

● సాంఘిక సంక్షేమ హాస్టళ్లలో

# కానరాని సంక్షేమం!

## జిల్లాలో ఘోరంగా తయారైన హాస్టళ్లు




కనీస సౌకర్యాలు కరువైన నెల్లూరు కొండాయపాళెంగేటు వద్ద గల బిసి బాలుర హాస్టల్.

పేద విద్యార్థుల ప్రయోజనం కోసం రాష్ట్రప్రభుత్వం ఏటా కోట్లాదిరూపాయలు వెచ్చిస్తున్నా వసతి గృహాల్లో సంక్షేమం కొరవడుతోంది. కనీస సౌకర్యాలు లేక విద్యార్థులు అవస్థలు పడుతున్నారు. చాలా హాస్టళ్లలో ప్రభుత్వం నిర్దేశించిన మెనూ అమలుకావడం లేదు. విద్యార్థులను కన్నబిడ్డల్లా చూసుకోవాల్సిన వార్డెన్లు మొక్కుబడిగా భోజనం పెడుతూ అందినంత దోచుకతినేందుకు ప్రయత్నిస్తున్నారు. శిథిలమైన భవనాల్లో త్రాగడానికి నీరులేక, ఎప్పుడు కూలుతుందో తెలియని స్థితిలో బిక్కుబిక్కు మంటూ కాలం గడుపుతున్నారు. వర్షం వస్తే వీటి పరిస్థితి అంతే. తడవకుండా వుండేందుకు విద్యార్థులు పడే అవస్థలు అన్నీ ఇన్నీ కావు.

ఆత్మకూరు పరిధిలో పలు ప్రభుత్వ వసతి గృహాలు దయనీయంగా వున్నాయి. సాంఘిక సంక్షేమశాఖ ఆధ్వర్యంలోని ఎస్సీ బాలుర వసతిగృహం శిథిలావస్థకు చేరుకొంది. ఆ భవనం ఎప్పుడు కూలుతుందో తెలియక విద్యార్థులు భయపడుతున్నారు. మరుగుదొడ్ల వసతి లేకపోవడంతో పలు అగచాట్లు పడాల్సివస్తోందని వాపోతున్నారు. అనంతసాగరంలోనూ చాలీచాలని గదుల్లో వుంటున్నారు. కావలి డివిజన్ కొండాపురంలోనూ ఇదే తీరు. కలిగిరి మండలంలో వుండే మూడు వసతి గృహాల్లో అరకొర వసతుల నడుమ విద్యార్థులు వుండాల్సి వస్తోంది. దొరవారిసత్రం తదితర ప్రాంతాల్లో సొంతభవనాలు లేక ప్రైవేటు భవనాల్లో హాస్టళ్లను నిర్వహించాల్సి వస్తున్నది. జిల్లావ్యాప్తంగా అనేక ప్రాంతాలు సొంత భవనాలు లేక, వున్నా కనీససౌకర్యాలు లేక విద్యార్థులు పలు ఇబ్బందులు పడాల్సి వస్తోంది. చాలాచోట్ల విద్యార్థుల సంఖ్య ఎక్కువగా వుండడం హాస్టల్ గదులు చాలకపోవడంతో భోజనం చేసే దానికి మాత్రమే హాస్టల్ భవనాలు వినియోగిస్తూ, ప్రక్కనే వున్న స్కూలు భవనాల్లో నిద్రించాల్సి రావడం దురదృష్టకరం. ఏకొల్లు ఎస్సీ బాలి కల వసతి గృహంలో పిల్లలు పడే బాధ వర్ణనాతీతం.

చిట్టమూరు ఎస్సీ బాలుర వసతి గృహంలో విద్యార్థుల భోజన, వసతి విషయాల్లో ఇబ్బందులు పడుతున్నారు. కోటలో గల ఎస్సీ హాస్టల్‌లో మరుగుదొడ్లు, స్నానపుగదులు లేవు. మంచినీటి కోసం పిల్లలు పంచాయితీ కొళాయిలపై ఆధారపడాల్సి వస్తోంది. అల్లూరు బాలికల వసతి గృహం నిర్వహణ అస్తవ్యస్తంగా మారింది. ఇటీవల ఇక్కడి విద్యార్థినులు పలువురు అస్వస్థులై ఈ హాస్టల్‌ను వార్తల్లో నిలిపారు. బోగోలు మండలం విశ్వనాధరావుపేటలోగల వసతి గృహం అధికారుల నిర్లక్ష్యానికి ప్రత్యక్ష సాక్ష్యంగా నిలుస్తోంది.

పిల్లలకు సంపూర్ణ ఆహారాన్ని అందించాల్సి వుండగా హాస్టళ్లలో అది కరువవుతోంది. ప్రభుత్వం నిర్దేశించిన మెనూను సక్రమంగా అమలు చేయడం లేదు. నీళ్ల సాంబారు, ఉడికి ఉడకని అన్నం వండి పెడుతున్నారు తప్ప పిల్లల సంక్షేమం గురించి, వారి బాగోగులు గురించి పట్టించుకొనే వారే కరువయ్యారు. భోజన సమయానికి చాలా మంది వార్డెన్లు హాస్టళ్లలో వుండకపోవడంతో వంట మనుషులదే పెత్తనం. ఎవరైన విద్యార్థులు ఆహారం బాగాలేదని ప్రశ్నిస్తే వారికి దెబ్బలు తప్పడం లేదు. గరిటెతో కొడుతున్నారని విద్యార్థులు కన్నీళ్లపర్యంతం అవుతున్నారు. వార్డెన్లు చుట్టపుచూపుగా హాస్టళ్లకు వస్తుండడం, అధికారుల పర్యవేక్షణ కొరవడడంతో హాస్టళ్లు సమస్యలకు నిలయాలుగా మారుతున్నాయి. చివరకు పిల్లలకు కప్పుకొనేందుకు దుప్పట్లు కూడా సక్రమంగా పంపిణీ చేయలేని స్థితిలో అధికారులు వుండడం సిగ్గుపడాల్సిన విషయం.



Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11



# అంతా వైశ్య మయం!

ముఖ్యమంత్రి రోశయ్య పేషీ మొత్తం వైశ్య మయమై పోతున్నదని కాంగ్రెస్‌వాదులు గుసగుసలాడుతున్నారు. ఏ సమయంలో వెళ్లి చూసినా జిల్లాల నుంచి వచ్చే ఆర్య వైశ్య సంఘం నాయకులు, వైశ్య వ్యాపార ప్రముఖులే కన్పిస్తున్నారని చెప్తున్నారు. రోశయ్య రాజకీయ నేపథ్యం ఆదర్శప్రాయమైనది. ఎన్‌జీ.రంగా వంటి నిబద్ధత కల్గిన నేతల వద్ద శిష్యరికం చేసి, రాజకీయ పాఠాలు నేర్చుకొన్న వారాయన. యాభై ఏళ్ల సుదీర్ఘ రాజకీయ ప్రస్థానంలో రోశయ్యకు ఏనాడూ కులం బురద అంటలేదు. కాంగ్రెస్ ముఖ్యమంత్రులందరూ ఆయన్ను వైశ్య ప్రతినిధిగా మంత్రి వర్గంలోకి తీసుకొన్నప్పటికీ, ఆయన మాత్రం తన స్వకులానికి దూరం పాటించేవారు. తన చేతుల మీదుగా జరిగే ప్రభుత్వ నిర్ణయాలు, రాజకీయ నియామకాలు వేటిలోనూ ఆయన స్వకులాభిమానం ప్రతిఫలించకుండా జాగ్రత్తపడేవారు. తమవాడు పైనున్నాడని వైశ్యులు సంతోషపడడం తప్ప, ఏనాడు కూడా తన వారిని సంతోష పెట్టాలనే ప్రయత్నం ఆయన చేయలేదు. కానీ ముఖ్యమంత్రి అయిన తర్వాత ఆ ధోరణి మారింది. తన వారను కొన్న వారిని బాగా దగ్గర తీస్తున్నారాయన. ఈ వార్త బాగా ప్రాకి పోవడంతో రాష్ట్రం నలుమూలల నుంచి వైశ్య ప్రముఖులు తండోపతండాలుగా ముఖ్యమంత్రి పేషీకి వస్తున్నారు.

కులాభిమానం ఒక్క రోశయ్యకే పరిమితం కాదు. వైఎస్, చంద్రబాబులు ఇద్దరూ తమ స్వకులానికి పెద్ద పీట వేసిన మాట అందరికీ తెలుసు. వైఎస్ పాలనను రెడ్డి రాజ్యంగా, చంద్రబాబు అధికార యుగాన్ని కమ్మ స్వర్ణయుగంగా భావించిన మాట నిజం. ఆ నిజం అందరికీ తెలిసినా ఏ ఒక్కరు కూడా పబ్లిక్‌లో వారిద్దరి కులాభిమానాన్ని ప్రశ్నించలేదు. రోశయ్యను మాత్రం ఇదేమి కుల పిచ్చి అని నిలదీస్తున్నారు.



నెల్లూరు సిటీ కాంగ్రెస్ ఇన్‌ఛార్జి డాక్టర్ అనిల్‌కుమార్, జాగృతిల పెళ్లి ఆగష్టు 22తేది కస్తూరిదేవి స్కూల్ గ్రౌండ్స్‌లో జరిగిన సందర్భంగా వధూవరులను అభినందిస్తున్న సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి.

# వైఎస్ పేరే ఒక బురద...!

వైఎస్ మరణించి ఏడాది కూడా కాలేదు. కానీ అంతలో ఆయన అనుచరులలో ఎంత మార్పు? గత సంవత్సరం ఇదే సమయానికి మేము వైఎస్ మనుషులము అని చెప్పుకోవడానికి ఎమ్మెల్యేలు, మంత్రులు ఎంతగా పోటీ పడే వారో తలచుకొంటే ఔరా అన్పిస్తున్నది. వైఎస్ పక్కన నిలబడి జనానికి కన్పడడానికి తహతహ లాడనివాడు లేడు. ఆయన జిల్లాలకు వెళ్లినప్పుడు ఈ పోటీ మరింత జాస్తిగా వుండేది. ఆయన మా మాటే వింటాడని చెప్పుకోవడం ఒక ఘనత. దాన్నిబట్టే అధికారుల దగ్గర ప్రాబల్యం. కానీ ఇప్పుడదే వర్గం వైఎస్‌తో సంబంధం లేదని చెప్పుకోవడానికి నానా తంటాలు పడుతున్నారు. వంటి మీద బురద పడితే కడుక్కొన్నట్లు తమ రాజకీయ జీవితం మీద వైఎస్ పేరు అనే మరక తొలగించుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. ఆనం రామనారాయణరెడ్డి, బొత్సా సత్యనారాయణ, పొన్నాల లక్ష్మయ్య, సబితా ఇంద్రారెడ్డి, డికె.అరుణ, గీతారెడ్డి, వట్టి వసంతకుమార్... ఇట్లా చెప్పుకొంటూ పోతే అందరిదీ అదే వరస. వైఎస్‌తో తమకు ప్రమేయం లేదని, తాము కాంగ్రెస్‌వాదులుగా తమ స్వశక్తితో ఎదిగామని, వైఎస్ ముఖ్యమంత్రి కాబట్టి ఆయనతో వుండేవారమని, ఇప్పుడు రోశయ్య ఆ స్థానంలో వున్నాడు కాబట్టి ఆయన్ను అనుసరిస్తామే తప్ప తాము వైఎస్ వర్గంగా చలామణి కాదలచుకోలేదని కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పేస్తున్నారు వీరు. వైఎస్ కుమారుడు జగన్ పేరు తమ ఇంట్లో విన్పిస్తే చాలు దెయ్యాన్ని చూసినట్లు ఉలిక్కి పడుతున్నారు. రోశయ్య ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన తొలిదినాలలో ఆయన్ను అవమానించిన మంత్రులంతా ఇప్పుడు ఆయన్ను మించిన నేత లేడని పొగడ్తలతో ముంచెత్తుతున్నారు. ఆనం రామనారాయణరెడ్డి అయితే, రోశయ్య మంత్రివర్గంలో పని చేయవలసి రావడం తమ దౌర్భాగ్యమని బహిరంగ ప్రకటన కూడా చేశాడు ఆ దినాలలో. కానీ ఇప్పుడు, రోశయ్య వంటి అనుభవజ్ఞుడి క్రింద పని చేయడం తన అదృష్టమని అన్ని సభలలో మాట్లాడుతున్నాడు. ఒక మంత్రివర్గ సమావేశంలో రోశయ్య మీద కాగితాలు విసిరినంత పని చేసి, అవమానించాడు రఘువీరారెడ్డి. కానీ అదే మంత్రివర్గ సమావేశాలలో ముఖ్యమంత్రి మీద ప్రశంసల పూల వర్షం కురిపించడంలో రఘువీరాది మొదటి స్థానం ఇప్పుడు. నాలుకకు నరం లేదని పెద్దలు వూరికే చెప్పలేదు కదా?

ముఖ్యమంత్రి రోశయ్యకు మాత్రం ఇది మహదానందంగా వుంది. మొదట మొదట తన మంత్రులే తనను అవమానించడాన్ని సహించలేక, అట్లని వారిని నియంత్రించలేక లోలోపల కుమిలి పోయిన ఆయన, ఇప్పుడు అదే మంత్రులు పోటీలు పడి మరీ తన పాదసేవ చేస్తుండడంతో ఉబ్బి తబ్బిబ్బు అవుతున్నాడు. ఈ మార్పులో తన ప్రమేయం ఏదీ లేదని ఆయనకు తెలుసు. అప్పట్లో, తనను ఆపద్ధర్మ ముఖ్యమంత్రిగా, తాత్కాలిక ఏర్పాటుగా మాత్రమే చూశారు కాబట్టి లెక్క చేయలేదని, ఇప్పుడు తన కుర్చీ 2014 వరకు పదిలం అన్న అభిప్రాయం ఏర్పడుతున్నది కాబట్టి అందరూ తన మెప్పు కోసం తహతహ లాడుతున్నారని ఆయనకు తెలుసు. ఈ రెండు అభిప్రాయాల మధ్య మార్పుకు అధిష్టానం దయ తప్ప తన ప్రమేయం ఏదీ లేదని కూడా తెలుసు.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన నాటి నుంచి నేటి వరకు గద్దె ఎక్కిన ముఖ్యమంత్రులందరిలోకి రోశయ్యకు ఒక ప్రత్యేకత వుంది. కాసు బ్రహ్మానందరెడ్డితో సహా ముఖ్యమంత్రులైన ప్రతి ఒక్కరూ ఎమ్మెల్యేలను మచ్చిక చేసుకోవడానికి ప్రథమ ప్రాధాన్యం ఇచ్చేవారు. 1978 తర్వాత అసమ్మతి రాజకీయాలు పెరిగినప్పటి నుంచి ముఖ్యమంత్రులకు ఎమ్మెల్యేల సానుకూలత ఒక్కటే రాజకీయ కర్తవ్యంగా మారింది. తమ దగ్గరకు వచ్చే ఎమ్మెల్యేలను సంతోషపెట్టి పంపడమే కాదు, అలిగో ఆగ్రహించో రాని వారిని కూడా మచ్చిక చేసుకోవడానికి నానాతంటాలు పడేవారు. కానీ రోశయ్యకు ఆ శ్రమ లేదు. ఏ ఎమ్మెల్యేని కూడా పట్టించుకోవడం లేదాయన. కాంగ్రెస్‌కున్న 156 మంది ఎమ్మెల్యేలలో పది పదిహేను శాతానికి మించి, పేర్లు కూడా తెలియవాయనకు. ఇప్పటికీ చాలామంది ముఖ్యమంత్రిని కలవడానికి వెళ్లినప్పుడు తమ పేర్లు చెప్పి, పరిచయం చేసుకోక తప్పడం లేదు. సోనియమ్మ దయ వున్నంతకాలం ఎమ్మెల్యేలు గిమ్మెల్యేలు తననేమీ చేయలేరని, ఆమె దయ తప్పితే అందరు ఎమ్మెల్యేలు తనతో వున్నా లాభం లేదని అర్థం చేసుకొన్నవాడు కాబట్టే రోశయ్య అంత ధీమాగా వుండగల్గుతున్నాడు.

## బోసిపోతున్న క్యాంప్ ఆఫీసు!

మాజీ ముఖ్యమంత్రి వైఎస్.రాజశేఖరరెడ్డి చాలా ముచ్చటపడి కట్టించుకొన్న భవన సముదాయం సిఎం క్యాంప్ ఆఫీసు. రెండు సువిశాలమైన మంత్రుల అధికారిక నివాసాలను కూలగొట్టి మరీ ఈ భవనాన్ని కట్టించారాయన. ఒక పక్క తన ఇల్లు, మరొకపక్క క్యాంప్ ఆఫీసు. వైఎస్ బ్రతికి వున్నప్పుడు రోజులో అధికభాగం అక్కడే గడిపేవారు. సెక్రటరియేట్ కంటే ఈ నివాసంలోనే సందర్శకులను పలకరించడం, అధికారిక సమావేశాలు జరపడానికి ఇష్టపడేవారు. ఆయన్ను చూడడానికి అధమ పక్షం రోజుకి ఐదారు వందల మంది జనం వచ్చేవారు. వారిలో పాతిక భాగం ఎమ్మెల్యేలు, వ్యాపార ప్రముఖుల వంటి విఐపి కోవకు చెందిన వారు. పొద్దున పది గంటల వరకు సిఎం క్యాంప్ ఆఫీసు కళకళ లాడుతూ వుండేది. ఎంత పని ఒత్తిడి వున్నా తనను కలవడానికి వచ్చిన ప్రతి ఒక్కరినీ ఒకటి రెండు సెకండ్ల పాటైనా మాట్లాడి సంతోష పెట్టేవాడు వైఎస్.

ఆయన నిష్క్రమణతో ఆ ప్రాంగణం కళ తప్పిపోయింది. ఏ కారణం వల్లనో కానీ రోశయ్య తన పాత ఇంట్లోనే సర్దుకపోతున్నాడు. అధికారిక నివాసానికి కాపురం మార్చలేదు. క్యాంప్ ఆఫీసుకు మాత్రం అప్పుడప్పుడూ వస్తున్నాడు. అయితే ఆయన్ను చూడడానికి వచ్చే సందర్శకుల సంఖ్య చాలా పరిమితం. తప్పనిసరి పని వుంటే తప్ప ఎమ్మెల్యేలు, మంత్రులు ఆయన్ను చూడడానికి రావడం లేదు. ఎన్నిసార్లు కలిసినా ఏ పనీ జరగనప్పుడు కలిసి ఏమి ప్రయోజనం అన్న నిరాశతో వున్నారు ఎమ్మెల్యేలు. ఇతర కోవలకు చెందిన విఐపిలు సిఎంను కలవాలంటే, ముందుగా ఫోన్ చేసి అపాయింట్‌మెంట్ తీసుకొని రావడం అలవాటు. కానీ రోశయ్య పేషీలో ఫోన్ ఎత్తేవాడు వుండడు. ఆయన పిఎస్‌లు, పిఏలు ఫోన్‌లో సమాధానం చెప్పరు. ఎప్పుడు ఎవరు ఫోన్ చేసినా బిజీ అని చెప్పి తప్పించుకొంటారు. సిఎం అపాయింట్‌మెంట్‌లు చూసే అధికారులూ అంతే. ముందస్తు అనుమతి లేకుండా వెళ్తే పోలీసులు అడ్డుపడుతున్నారనే భయంతో చాలా మంది విఐపిలు పని వున్నప్పటికీ సిఎంను కలవడానికి రావడం లేదు.

ఇక సాధారణ సందర్శకుల సంగతి చెప్పనే అవసరం లేదు. ముఖ్యమంత్రికి విన్నవిస్తే తమ సమస్యలు పరిష్కారం అవుతాయన్న ఆశతో వందల సంఖ్యలో వచ్చే సాధారణ పౌరులు ఇప్పుడా ప్రయత్నమే చేయడం లేదు. సిఎం గారు క్యాంప్ ఆఫీసుకు ఎప్పుడు వస్తారో, అసలు వస్తాడో రాడో తెలియక పోవడమే అందుకు కారణం. ఒకవేళ వచ్చినా, రోశయ్య సాధారణ సందర్శకులకు సమయం ఇవ్వడం లేదు. దానితో సిఎం క్యాంప్ ఆఫీసు బోసిపోతున్నది. వైఎస్ హయాంలో రాజసౌధం వలె మిలమిలలాడిన ఈ భవన సముదాయం ఇప్పుడు పాడుపడిన భవంతి వలె వెలవెల పోతున్నది. ఏ సమయంలో చూసినా ఖాళీగా కన్పిస్తున్నది. దారిన వెళ్లే ప్రతి ఒక్కరూ వైఎస్ కాలం నాటికి, నేటికి తేడా చర్చించుకొంటూ వెళ్లడం అలవాటై పోయింది.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.